# సీతాన్వేషణము



భారతీ గ్రంథమండలి,
ఉరవకొండ.

మారుతీగ్రంథమండలి—8

సంపాదకుడు—యు. గోవిందాచార్యులు.

# సీతాన్వేషణము

(నాటకము)

గ్రంథకర్త:

చింతా - నరసింహారెడ్డిగారు

ప్రకాశకులు:

మారుతీగ్రంథమండలి, ఉరవకొండ.

(అనంతపురముజిల్లా)



1937 (అక్టోబరు)

| | |
|---|---|
| చందాదారులకు | 0 8 0 |
| ఇతరులకు | 0 10 0 |

# పోషకులు

| | | | |
|---|---|---|---|
| 1. | మ-రా-శ్రీ | మిడదల కరియప్ప అండ్ సన్స్ | ఉరవకొండ |
| 2. | ,, | మిడదల నారాయణప్పగారు | తిమ్మనచర్ల |
| 3. | ,, | కరణము వేంకటదాసప్పగారు | చీకలగురికి |
| 4. | ,, | మల్లికార్జునప్ప, బసలింగప్ప మాంతే దేశాయిగారు | గడేహోతూరు |
| 5. | ,, | కరణము విరూపాక్ష రెడ్డిగారు | గడేకల్లు |
| 6. | ,, | కంది బ్యాడల హనుమంతప్పగారు | ,, |

# అభిమానులు

1. మ-రా-శ్రీ బుశెట్టి హొన్నప్ప శ్రేష్ఠిగారు ఉరవకొండ
2. ,, పాకము ఎర్రెప్పగారు ,,
3. ,, కల్లూరు గిరియప్పగారు ,,
4. ,, యల్. భగివాన్ దాసుగారు ,,
5. ,, మావినమడుగు రాచయ్యగారు లత్తవరము
6. ,, పా. వీరనగౌడుగారు ,,
7. ,, కె. వెంకోబరావుగారు తిమ్మనచర్ల
8. ,, పి. తిమ్మారెడ్డిగారు గుంతకల్లు
9. ,, మేటి విరుపన్నగౌడుగారు బుధగవి
10. ,, కరణము వాసుదేవరావుగారు పాపిలి
11. ,, దేశాయి హొన్నప్పగారు విడపనకల్లు
12. ,, పా. చిన్నరామప్పగారు రేణిమాకులపల్లి
13. ,, కె. శేషగిరిరావుగారు వ్యాసాపురము
14. ,, పా. కేశవరెడ్డిగారు రాంపురము
15. ,, పా. శివారెడ్డిగారు కడదరబెంచి
16. ,, జి. వేంకటరెడ్డిగారు హంచనహాళు
17. ,, పి. నాగిరెడ్డిగారు వజ్రకరూరు
18. ,, ఎ. వెంకటరమణప్పగారు ఆమిద్యాల
19. ,, పా. చిన్నరెడ్డిగారు కమలపాడు
20. ,, బి. భీమరావుగారు బి.ఏ., బి.యల్. బళ్లారి
21. ,, కె. హనుమంతరావుగారు రేకట్ల
22. ,, పొ. చెంచురెడ్డిగారి నరసింహారెడ్డిగారు ,,
23. ,, యల్క. పాపిరెడ్డిగారు కత్తెరమల

[చందాదారుల పట్టిక సకము కడపటిభాగమున ముద్రింపఁ

# సంపాదకీయము

ఈగ్రంథమండలి సప్తమకుసుమముగాఁ బ్రకటింపఁబడిన 'మేఘప్రతి సందేశగీతము' నందు అష్టమకుసుమముగా 'మా విజయనగరయాత్ర' యను గ్రంథము వెలువడునట్లు ప్రకటించి యుంటిని. కాని, కారణాంతరములచే దానిని బ్రకృతము ప్రకటింపఁజాలనైతిని. రాఁబోవువత్సరము దానిని దప్పక ప్రకటించి, యాంధ్రలోకమున కర్పించుకొందునని మనవి సేయుచున్నాఁడను.

అష్టమకుసుమముగా 'సీతాన్వేషణ' మను నాటకమును బ్రకటించితిని. కర్త, కడప మండలాంతర్గతమగు కొత్తపల్లి వాస్తవ్యులగు శ్రీయుత, చింతా-నరసింహారెడ్డిగారు. వీరాంధ్ర లోకమునకుఁ జిరపరిచితులు. ఇందు, లంకాధినాథుఁడగు రావణుఁడు సీతను నపహరించుకొని పోవుట మొదలు, వాయు సుతుఁడు, సీతనన్వేషించివచ్చి, యావృత్తాంతమును రామున కెఱింగించుటవఱకును గల కథ వర్ణితము.

ఈనాటకమునుగూర్చి పండిత ప్రకాండులు సదభి ప్రాయము లొసఁగియున్నారు. మచ్చునకుఁ గొన్ని యిట నుదాహృతములు.

'It is interesting to read and beautifully written' అని శ్రీయుత, కట్టమంచి-రామలింగారెడ్డిగారును, 'శైలి, మనోహరము; కథాకథనము రుచిమంతము; పద ములు, సుకుమారములు; వృత్తి యుత్తమము; రసము,

కొఱఁతవడదు. పూర్వవైభవము, నీతి, పాతివ్రత్యము, క్షాత్రము, శుద్ధప్రణయము నిందుఁ దాండవించుచున్న'వని బ్రహ్మశ్రీ, రాజశేఖర వేంకటశేషకవులును, 'నాటకశైలి గంగాప్రవాహమువలె సొంపుగను, సుహృదయ హృదయ రంజకముగ నున్నది. అందందుఁ బొందుపఱచిన పద్యములు గద్యమునేపోలి సొంపుగనున్న'వని బ్రహ్మశ్రీ, జనమంచి-శేషాద్రిశర్మగారును, 'I admire your work as a piece of artistic composition nicely done. It contains many signs of latent power which ripening will give you a high rank as a poet and author of high ability fine expression and rich imagination' అని బ్రహ్మశ్రీ, యస్. లక్ష్మీనరసయ్యగారును వక్కాణించిరి.

ఇట్టి యుత్కృష్టగ్రంథమును బ్రతిఫలరహితముగ మా గ్రంథమండలి కొసఁగిన శ్రీ రెడ్డిగారి కెంతయుఁ గృతజ్ఞుఁడను.

'కవితాకుటీరము' ఉరవకొండ,
25-10-1937.

సంపాదకుఁడు.

# అభ్యర్థనము

మహాశయులారా,

సీతాపహరణమును వ్రాసి, పాఠకలోకమున కర్పించి, నేఁటికి నాలుగువత్సరములైనను గార్యబాహుళ్యముచేతను, ప్రియసతి స్వర్గమున కేఁగుటఁ జేసియుఁ గవితాలోకమును వదలి, సంసార తాపత్రయములఁ జిక్కి, యింతవఱకు గ్రంథరచనకుఁ గడంగక యూరకుంటిని.

మా గ్రామములోని 'శారదావిలాస నాటకసమాజము' వారు ప్రదర్శనానుకూలముగ నుండునటుల, సీతాపహరణానంతరకథను వ్రాయ నన్నుఁ బ్రోత్సహింప, మిత్రుల వేఁడికోలున కంగీకరించి, 'సీతాన్వేషణ' మను నీయయిదంకముల నాటకమును వ్రాసితిని.

పండితు లిందలి దోషములను మన్నించి, స్తనంధయుల వచ్చీరాని పలుకులరీతిఁ దలంపఁ బ్రార్థించెదను.

గ్రంథకర్త.



చింతా నరసింహారెడ్డి

# DEDICATION

TO

MY BELOVED MATERNAL UNCLE

**Late M. R. Ry. K. SUBBA REDDY, B.A.,**

*Barrister-at-law, Kottapalle*

THIS BOOK

IS

Most Respectfully Dedicated

as

a humble mark of esteem and gratitude

by

*The Author.*

**K. C. N. REDDI,**

**KOTTAPALLE.**

# నాటకపాత్రలు

## పురుషులు

1. రాముఁడు
2. లక్ష్మణుఁడు
3. రావణుఁడు
4. ఇంద్రజిత్తు
5. విభీషణుఁడు
6. ప్రహస్తుఁడు
7. జటాయువు
8. సంపాతి
9. కబంధుఁడు
10. వాలి
11. సుగ్రీవుఁడు
12. అంగదుఁడు
13. హనుమంతుఁడు
14. నీలుఁడు
15. జాంబవంతుఁడు

## స్త్రీలు

1. సీత
2. శబరి
3. తార
4. రుమ
5. స్వయంప్రభ.

శ్రీ

# సీతాన్వేషణము

## ప్రథమాంకము

### ప్రథమరంగము

స్థలము:-అరణ్యము. ప్రవేశము:-రావణుఁడు, సీత.

ఒకప్రక్కన రథముండును.

సీత:—ఓరీ! రావణా! కామాంధుండవై కన్నుఁగానక నన్నీగతిఁ జెఱఁ గొంపోవన్యాయమా? పాపాత్మా! పరకాంత యనితలంపక నన్నీగతిఁజేయుట యుచితంబుగాదు. క్రూర కర్మా! శ్రీరామునకుఁజెందిన నన్నుఁగోరుట లగ్నిఁజేరు శలభంబురీతిగాని వేఱుగాదు. దుష్టమతివై నాకిట్టి కీడుఁజేసిన నిన్ను విదితశస్త్రాస్త్ర రాఘవుండును, ప్రచండ కోదండ హరణవినోదియు, ఖరదూషణాది రాక్షస శిరచ్ఛేదియునగు రాఘవుఁడు నీఱుగావించును.

చ. విడుమిఁక దుర్మదాంధ! నను, వీరవరేణ్యుఁడవయ్యు నీవె యీ
వడువునఁ ద్రుచ్చిలింతె? పతివచ్చిన నీగతి కానలాల్లవం
చడుగఁగ నేల? నన్నుఁ గొనియల్లన నేగడు బుద్ధిమాని, నీ
వడుగులకున్ బనిగొలిపి యబ్ధినిఁదాఁటగఁ బొమ్ము రావణా !

ఓరీ! రాక్షసాధమా! నన్ను విడిచి, చెంపలు వేసికొని, యూరక వచ్చినదారిఁ బొమ్ము.

రావణుఁడు:-సీతా! నీనాథుండంతటి మేటిమగండే? అఖిలదిగ్జయుండనగు నాముందర నీధవుఁ డెంతటివాఁడు. సురగరుడోరగ సిద్ధసాధ్యులడ్డంబైనను నిన్ను విడుచువాఁడఁ గాను. నీ మందహాసము నిత్యము నాప్రేమాంబునిధికిఁ జంద్రిక లగునని యెంచియుండు నేననంగ విద్యానిరూఢ పల్లవ బంధుర పరికంపిత శరీరాలంకారవగు నిన్నుఁ గన్నులారఁగాంచి విడిచి పోవునంతటి మందుండఁగాను.

గీ. బాల! యీరీతి బెదరింప బేలనగుచు
నిన్ను విడనాడిపోదునే నీరజాక్షి;
యెందువెదకిన నీయంద మెందులేదు
చేటలనుగొట్టి బెదరింతె చేడెనన్ను.

సీత:——రావణా! సాధ్వీ కోపాగ్ని భగ్నశలభమా! నీ దుర్మతమును విడువవా? నీయవివేకము నిప్పుడైనఁ దెలిసి కొని పుత్రమిత్రకళత్రములయం దాశయున్నచో నీదుర్మతమును విడిచి, యూరక వచ్చినదారిఁ బొమ్ము. కాలకూటవిషము నైన మ్రింగవచ్చును గాని, పరాంగనలనుహరించి నెగ్గరాదు సుమా!

ఏమేమి? దాడిమీ బీజరదనాంచితా! నిరుపమాన బలపరాక్రమ సమన్వితుఁడగు నీలంకాధినాధునేల నిరసించెదవు.

సీ. కైలాసమునకేఁగి గాలించిచూచితిఁ
గలకంఠి! నినుఁబోలు కాంతఁగానఁ
బాతాళమునుజొచ్చి పరికించిచూచితి
భామరో! నినుఁబోలు పడఁతిఁగాన
నెనిమిదిదిక్కుల నేర్పడఁజూచితి
నలివేణి! నినుఁబోలు నతివఁగాన
స్వర్గలోకముఁజొచ్చి పాటించిచూచితి
సుందరి! నినుఁబోలు సుదతిఁగాన

గీ. సిద్ధసాధ్యులతరుణులు, సీత! నీదు
కాలి కొనగోటికెనరారు; కాంత! నేను,
గమ్మ సలుకాని జాలువా బొమ్మ యనఁగఁ
జాలు నినువీడిపోఁజాలఁ జంద్రవదన!

సీత:—ఓరోరి! బ్రహ్మానంద బడబానలా! కించిదజ్ఞా! నీదుండగములను వినునవా? "వినాశకాలే విపరీతబుద్ధిః" అను నార్యోక్తి నీయెడ సార్థకముగానుండ నాహితవాక్యములేల రుచించును. (స్వగ) నిష్కారణముగ నిష్కపటియగు లక్ష్మణుని శంకించి నిందించిన పాపఫలంబిపు డనుభవించుచుంటిని. కానిమ్మింకేమి చేయఁగలదానను. ఎలుంగెత్తి యెవ్వరిసహాయంబైన నర్థించెదఁగాక. (ప్రకాశము) దండకాటవినుండు సమస్త చరాచరములారా! రాముని యిల్లాలగు నీదీనురాలి మొఱ నాలకింపుఁడు. శ్రీ రామలక్ష్మణులు నాచెంత లేనియెడ నెఱింగి, దురాత్ముండగు రావణాసురుఁడు నన్నుఁ

జెఱ గొంపోవుచున్నాఁడు. నన్నీ విపదంబుధినుండి దరిఁ జేర్పఁడు.

(ప్రవేశము):—జటాయువు: (స్వగ) ఏమిది? దుఃఖభయంబులఁ బెనఁగొనుమతితోడఁ బెద్దయెలుంగున సహాయంబునుగోరి యొక తరుణీలలామ విలపించుచుండినటుల వినంబడుచున్నది. (అన్నిదిక్కులు పరికించి) అల్లదే క్రూరకర్ముం డెవ్వండో యొక తరుణీమణిని రథమునందిడుకొని పోవుచున్నాఁడు. (నిదానించిచూచి) తెలిసెను. వీఁడు లోకకంటకుఁడగు రావణుఁడు. పతివ్రతామతల్లియగు సీతాసతినిఁ జెఱ గొంపోవుచుండినటుల నీ తరుణార్కబింబకాంతుల మఱపింపఁజాలు మేనికాంతులఁ గలుగు తరుణీమణివిలాపం బెఱింగించుచున్నది. కానిమ్మొ చెనఁటి మదమడంచి, యీ దురాత్మునిచెఱనుండి విముక్తురాలినిఁగఁ జేసెదఁగాక. (ప్రకాశము) బ్రహ్మవంశజనితుండవగు నోరావణా! లోకమాతయగు సీతాజననిని బల్మినిఁ గొంపోవుచుంటివా? రాముఁడు సర్వజగత్ప్రసిద్ధ ధీమహితుఁడనియు, సుధీమంతుఁడనియు, భూస్తోమంబులకెల్ల రాజనియు నెఱుంగవా? అట్టిలోకైకనాథునిల్లాలిని యశస్వినిని ధరాతనూజాతను హరియింపజెల్లునా? ధర్మతత్పరుండగు ధారుణీపతికిఁ బరదారాపహరణంబు భావ్యంబు గాదనుటెఱుంగవా? శూర్పనఖానిమిత్తమై జనస్థాననివాసియు నతిదర్పితుండును నగు ఖరుఁడు రఘూద్వహుఁ జెనకి ప్రాణములఁ గోలుపోయెను. కాలభుజంగమునుముడిచి కొంగునఁ గట్టికొనుట భావ్యముగాదు. మోయగలయంత భారమునె

మోయఁ దలకొనంగవలయుఁగాని, శక్తికిమీరిన పనులఁ జేయఁగడంగుట కష్టంబులకు మూలంబని యెఱుంగుము. నాహితవాక్యములనాలించి సీతామహాజనని విడిచిపొమ్ము.

మ. కుమతీ! ధర్మముగాదునీకు నిటులన్ క్రూరుండవై చోరతన్
సుమగాత్రిన్ బతిచెంతలేనితఱి నీవున్ బూని కొంపోవఁగా
సమయన్ జూచెద వేలయిట్లు: పడఁతీ సంరక్షణోత్సాహియై
సమవర్తిన్ గనఁబంపు రాఘవుఁడు నాసద్బోధ నూహింపుమా.

రావ:—ఏమీ! నీవాచాలత్వము. కైలాసమును గంధుకమునుబోలె నాడించిననాముందుఱ నొకమానవాధముఁ బొగడి వెఱపుగొలుపుచుంటివా! పానకములోని పుడకరీతి నీవేల నాయుద్యమమున కడ్డుతగిలెదవు.

జటా:—దశకంఠా! ధర్మంబుపదేశించితినిఁగాని, ధర్మమూరుండవగు నీకది రుచింపదయ్యె. ముదుకండనగుట నన్నలంతిగఁ జూచుచుంటివి •కాఁబోలు. ముదుకండనైనను వనజాతాయత పత్రనేత్రను, రఘుస్వామి చిత్తేశ్వరినిఁ గొనిపోనీయను. దుర్వారవిక్రాంతిచే నిన్ను రథంబునుండి యస్తోకజవంబునఁ బుడమికిఁ ద్రోయుదును. దురాత్మా! నిన్నింక వదలుదునని తలంపకుము. యుద్ధమున కాయితముగమ్ము.

రావ:—ఓరీ! శ్యేనితనూజా! ముల్లోకములజయించిన యీరావణునితో వైరమునీకేల? నీదారినిఁబొమ్ము.

సీ. ధనదునిదయవీడి దండించి, బలిమిమైఁ
బుష్పకంబునుగొన్న పూజ్యతముఁడ,
రజతశైలము నెత్తి గజచర్మధరములఁ
[illegible]ంటి లోకమక్క[illegible]మ్ము పడఁగ,

అనరణ్యరారాజు నాజిలోఁ దునుమాడి
పేరుగాంచినమేటి ధీరవరుఁడ,
జముఁడు నన్మార్కొనఁ జంక భీరునిరీతిఁ
బాఱంగఁజేసిన బల్లిదుండ,
గీ. సూర్యచంద్రుల నిర్జింతు శూరుఁబోలె,
నింద్రుఁ బంపితి నడవికి నింతితోడ,
నన్నుఁబోలెడు వీరు లెందున్నవారు?
అట్టి నాతోడ నీకేల యాహవంబు.

జటా:—ఓరీ! ఆత్మశ్లాఘపరాయణా! నీబెదరింపుల కేను వెఱతునే.

చం. ఎఱుఁగుదు నేను, నీవు, మును నేర్పడ నర్జునుచేతఁ జిక్కుటన్,
గఱకరి! నీదువోటమిని గామినిరీతిని నింద్రసూనుచేఁ,
గలఁతను శంకరున్ గిరితో కాయము నొవ్వఁగ నెత్తసెంచియున్,
ఎఱుఁగుదు, కొండక్రిందఁబడి యేడ్చుటలెల్లను రాక్షసేశ్వరా.

కార్తవీర్యార్జునునకోడి చెఱఁబెట్టఁబడి దీనవదనుండవై యుండఁ బులస్త్యుఁడు కరుణించి నిన్ను విడిపించుటే నెఱుంగనని తలంచితివా? శూరాగ్రేసరుఁడగు తారాపతి బాహుబలంబునకు విజితుండవయి నీవు పడినపరాభవంబు నాకుఁ గ్రొత్త కాదు. బాహుబల గర్వాంధుండవై కన్నుఁగానక కైలాసము నెత్త గమకింప, గరళకంఠుండలిగి, వామపాదాంగుష్ఠమునఁ ద్రొక్క, నీకరంబులు క్రిందుపడ, శూలికాలి పెనువ్రేలుఁ దెమలించి కరములెత్తుకొను సమర్థతలేక వేయేండ్లార్తుండవై పదినోళ్లఁబెట్టు వాపోవఁగా, పురారి నీ నుతికిఁ దద్దయు మెచ్చి

విడిచిపుచ్చుచే నెఱుంగుదును. నీ కాయువు మూడియుండ నానీతులు రుచించునా? పైత్యరోగికిఁ బంచదారసహితము విషతుల్యంబుగ నుండును. కానిమ్ము. చూతము. ఊరక నిన్ను వదలుదునని తలంపకుము. (అని పక్షవిక్షేపముచే సారథినిఁ జంపును.)

రావ:—ఓరీ! అకారణశత్రూ! పోలుదునని నాతో యుద్ధమునకీగతి డీకొనఁజనుట యుచితంబుగాదు. దురాత్మా! నీపాగరణంచెదను చూడుము. (అని బాణమును వదలును.)

జటా:—నిశాచరాధమా! నీవు వదలినబాణము నిష్ఫలంబగుచు నేలఁబడియె. రావణా! నాబోధలు నీకు రుచింపవటరా? పుత్రమిత్రకళత్ర బాంధవులతో గరళంబమృతంబని త్రావఁజనునా? నీవీ దుర్మతమునుండి విముఖుండవయి నోరు మెదల్పకుండ సీతనుడించి, చెంపలువేసికొని, వచ్చినదారిఁ బొమ్ము. లేకున్న నీప్రాణములు నిలువవని యెఱుంగుము. (అని కిరీటమునుదన్నును. కిరీటము నేలఁబడును.)

రావ:—ఏమీ! నీదుండగములు మెండయ్యె. నా సారథినిఁజంపి, తేరుతుత్తునియలుఁ గావించి, నాబోమిడికను బడవైచితివి. పాపీ! నీవింకఁ జచ్చితివి. (అని కత్తిని విసరఁ బక్షములు తెగి, జటాయువు నేలకొరగును.)

(రావణుఁడు సీతతో నిష్క్రమించును.)

# ప్రథమాంకము

## ద్వితీయరంగము

స్థలము:- దండకాటవి. ప్రవేశము:- రాముఁడు ధనుర్బాణధరుండై

ఔరా! నాబాణంబున కాహుతియగుచు ఖలుండగు మారీచుఁడు మద్రవానుకృతి బల్కుగాసె. ఈనాదంబా సీతాసతివిని, భ్రాంతురాలై, నన్నరోయ సుమిత్రాసుతుఁ బంపి యుండును. వదినెమాట కెదురాడవెఱచి లక్ష్మణుఁడును సీతను వదలివచ్చును. ఏమికీడు మూఁడనున్నదోగాని, నాకవశకునములు గానఁబడుచున్నవి. కానున్నది కాకమానదుగదా! (దిక్కులు పరికించి) అనుకొన్నరీతిగనే సుమిత్రాసుతుం డరుదెంచుచున్నాఁడు. (ప్రవేశము: లక్ష్మణుఁడు)

రాముఁడు:—సౌమిత్రీ! ఏమిది? అవనిజ నొంటరిగ విడిచివచ్చితివేల?

సీ. పర్ణశాలనువీడి పటురయంబున నిట్లు
చనుదెంచుటేలొకో సదయహృదయ?
లక్ష్మ:—రక్కసుమాయల రమణి భీతిల్లుచు
నిన్నరోయఁగ వేగ నన్నుఁబంపె,
రాము:—రక్కసులననెంత రామచంద్రునకంచు
సీత నెమ్మది కెక్కఁ జెప్పలేద?
లక్ష్మ:—హా! సీత! యనుకేక నలివేణి వినినంతఁ
దూలనాడుచునన్నుఁ దోలఁగఁబంచెఁ,

రాము:—గీ. జిన్నితమ్ముఁడ నామది కిన్నరాని
సందియంబులు గలిగెడు; సరభసమునఁ
బర్ణశాలను జేరఁగఁ బరుగులిడుట
మంచిదంచును దోఁచెడు మదికినిపుడు.

అన్నా! లక్ష్మణా! ముక్కడీరక్కసుల మాయలకు లోనైయబలయగు మీవదినె నొంటరిగ విడిచివచ్చితివే! లక్ష్మణా! వింటివే! వఱను లుగ్రంబుగ నఱచుచున్నవి. కంటివే! నావామలోచనం బదరుచున్నది. ఈయవశకునములఁ గన నామనమున భరింపరాని పరితాపము కలుగుచున్నది. ప్రాణముకంటె నాకుఁ బ్రియమైన మహీసుతకెట్టి యిడుమలును గలిగియుండవుగదా!

లక్ష్మ:—అగ్రజా! కూయివిన్నంతనె, 'కుమారా! మాయన్న కెద్దియో విపత్తుకలిగినది. త్వరితగతి సహాయార్థం బేగు'మన, 'మాయన్న కాపదకలిగింపఁజాలు సమర్థుఁడు ముల్లోకములం దెవుడునులేఁ'డని నేనెంతచెప్పినను వినక, ములుకులఁబోలు కఠినంపుఁబలుకులచే నామనమును నలయింప నిలువఁగాల్లాడక, నీకడ కరుదెంచితిని.

రాము:—సోదరా! "స్త్రీబుద్ధిః ప్రళయాంతకః" యను నార్యోక్తినిగమనించక, కిన్కచేఁ గఱకులాడెనని కోపమున నిటు కోమలినివిడిచి రాజనునా? నాయాజ్ఞాభంగమునకు వెఱవవైతివిగదా?

గీ. కెలఁది కఠినపుఁబలుకుల కలిగినీవు,
సీత, భయదాటవులపాలు సేయఁదగునె?

యన్నయాజ్ఞను దాఁటంగనగునె, యెంత
వెట్టివో! నాకు, సాయమై వెడలిరాగ.

కానిమ్ము. సోదరా! పర్ణశాలను జేరఁబోవుదమురమ్ము.
(నిష్క్రమింతురు)

తెరయెత్తఁగా-ప్రదేశము: పర్ణశాల.

రాము:—లక్ష్మణా! కుటీరమును సమీపించుకొలఁదిని నామనమున కారాటం బెక్కుడగుచున్నది. సాధ్వియగు సీత యున్నజాడ లగుపడవు. ఆతరుణీమణినిఁబాసి నేను నిక్కువముగ బ్రతుకఁజాలను. (పర్ణశాలలోనికేగి, వెలుపలికివచ్చి) సృష్టిసహితము వ్యసనమును గనఁబఱచుచున్నది గదా!

గీ. అక్కటా! మోసమొదవెను, వనవిహితను
గుటిలరాక్షసుఁ డెవ్వఁడో క్రూరుఁడగుచుఁ
జంచి, చెండాడిపోయెనో, చిన్నియన్న!
యతివజాడలు గన్పట్ట వరసిచూడ.

నిక్కువముగ సీతాసతి యిందులేదు. అక్కటా! యింకేది తెరువు.

లక్ష్మ:—శశిధరచాప విభంజనశీలా! రామా! మేలము లాడనెంచి భూసుతభూరుహములచాటున నెందైన దాఁగియున్నదేమో వెతకుదము గాక.

ఉ. తల్లిరో! యెందుదాఁగితివో? తావకనాథుఁడు రామచంద్రుఁడా
కల్లరిదైత్యుని న్దునిమి గాసిలిచెచ్చెర వచ్చినాఁడిదే,
యుల్లము తల్లడిల్ల నిటులూరకమాటున దాఁగకింక, నీ
వల్లభుఁజేరు, మాతఁడు, భవత్పరిచర్యకు వంతసెంచెడున్.

మాతా! మాయలేడిరూపమునఁ జనుదెంచిన మారీచుఁడునిమి, నిన్నుఁజూచు కుతుకంబున రామచంద్రుఁడరుదెంచి యాతురముఁ జెందుచున్నాఁడు. పరిహాసమునకిది సమయము గాదు. వేగమ చనుదెంచి, నీముఖబింబమునుజూపి, మా యన్నను సంతస మొందఁజేయుము.

రాము:—సోదరా! ఇంకెక్కడి సీత. నాప్రణయ సామ్రాజ్యాధిపతి, నాదయిత, నాప్రాణంపుఁ బ్రాణము, నాకు దూరమయ్యె. అరణ్యవాసానంతర మయోధ్య కేఁగినంతఁ, దల్లులును సహోదరులును 'సీతయే'దని యడుగ, నేమి సమాధానం బొసంగుదును. సోదరా! రాముండిఁక బ్రతుకుటసున్న. నీవయోధ్యకరిగి సుఖంబుండుము. నాతల్లిని నామారుగఁ బ్రీతిఁ జూడుము. నాయాజ్ఞగ భరతుని స్థిరముగ రాజ్యమును బాలింపుమనుము.

ఉ. అంకమునందుఁ జేరి, ననుహాయినిఁ జెందఁగఁజేయుసీత, బా
ల్యాంకవి చేష్టలన్దగిలి, యక్కట! లేడినిఁ దెమ్మటంచుఁదాఁ
గొంక నన్నుఁబంపియును, గోమలియెందుల దాఁగియుండెనో?
సంకటమయ్యెడుక్ మదికి, సారసనేత్రను గాంచకుండుటక్.

ఇంక, నాపరితాపమున కంతములేదు కాఁబోలు. హెచ్చిలుతాపభరంబున నచ్చపలాక్షినిఁ దలఁచితలఁచి, స్రుక్కిస్రుక్కి, చావవలసినదేగాని, మఱొంకమార్గంబు గోచరింపదు. క్షమాసుతలేక తనువునఁ బ్రాణములు నిలుపఁ జాలను. ధారణిఁ గోలుపోయినను, భయంకరాటవిని వన్యాహారంబులఁ దినుచుఁ గటికరానేలలఁ బరుండుచుండినను,

సీతాసతి, నాకుబంగట వసించుటఁజేసి సంతస మొందు చుంటిని. జానకి లభించునుపాయం బగుపడదు. కాన, నే మనుట సన్న.

గీ. పోయిరావన్న, శుభములఁ బొందుమన్న,
రాముఁడెందుండె ననియెడు రాణులకును
నాకలోకంబుఁ జేరెను, నాతివిడిచి
బ్రతుకఁజాలక, యంచును బలుకుమన్న.

లక్ష్మ:—అన్నా! ప్రాకృతులరీతినిఁ జింతిలఁ దగునా? ప్రాకటముగ నాతలోదరిని వెతకుదముఁగాక. మహాత్ము లాపదలు ఘటించువేళల శోకముఁ జెందరు. సోదరా! ముందుగ సీతామతల్లి యీ ప్రాంతములయం దెందైనను నుండె నేమో వెతకుదము రమ్ము.

రాము:—లక్ష్మణా! నీకింకను నిట్టి భ్రాంతియేల? తా నొంటిగఁ బర్ణశాలనువీడి, క్రోల్పులులువసించు నీఘోరవన ములఁ దిరుగాడ నుంకించునా? కానిమ్ము. నీయిష్టాను సార మరయుదమురమ్ము. (నిష్క్రమింతురు.)

# ప్రథమాంకము

## తృతీయరంగము

స్థలము:-దండకాటవి. ప్ర: రామలక్ష్మణులు చింతాక్రాంతులై.

రాము:—పద్మదళాయతాక్షి పాదపద్మముల జాడలిం డెందును గానఁబడవు. మింటి కెగసియుండునా? లేక, పాతాళముఁ జేరియుండునా? యనుశంక వొడముచున్నది. మృగసముదయములు ముగుదపోఁబడిఁ దెలుపుచున్నవో యన, మోరలాకసంబునకెత్తి, వ్యసనమును గనుపఱచుచు యామ్యదిక్కున కరుగుచున్నవి. లక్ష్మణా! మనము దక్షిణదిశకుఁ బోయి, యా యేణలోచనను వెతకుట మేలని తోఁచెడిని. (అని కొంతదూరముపోయి) సుమిత్రా తనూజా! యిటు చూడుము.

గీ. కుసుమము లియ్యెడఁబడియుండె, సుదతి నెవరో
కొంచుపోయినజాడలు గోచరించుఁ;
గలికివదనంబు నేరీతిఁ గాంచఁగలము?
మార్గమును జూపఁగలిగెడు మాన్యుఁడెవఁడో!

అనుంగుసోదరా!

సీతాదేవి శిరమున ధరించియుండిన యీకుసుమములఁ గాంచినంత, జానకినిఁ గాంచినంతసంతసము కలుగుచున్నది. ఇంక సీతజాడలఁ దెలియుటగూడ సుకరంబని తోఁచుచున్నది.

లక్ష్మ:—సోదరా! అటుచూడుము. ఎవ్వఁడో యొక రక్కసుం డేమియునెఱుంగనివాని చందమునఁ బడియున్నాఁడు. మనలవంచించిన పాతకుఁ డాతఁడేయని తోఁచుచున్నది.

ఉ. భీరుఁడు, దుర్మదాంధుఁ, డలివేణిహరించిన పాతకుండునున్
సారవిచార! నీమదిని సంతసమింకఁగఁ జేసినట్టియా
చోరుఁడు, పక్షిరూపమునఁ జొక్కుచు సోలుచు నిందెయుండె,
క్రూరుని, రాక్షసాధమునిఁ గూల్చెద, డెందము మోదమందఁగన్.

రాము:—అనుజా! ఆతురముఁ జెందనేల? నిజానిజంబులఁ దెలిసికొనిగాని యెట్టికార్యములను జేయఁగడంగరాదు. రక్కసుఁడుఁగాకున్న పాపంబొడికట్టుకొనుటయెగాక, వేఱొండు గలదా? చెంతఁజేరి, నిజంబరయుదము రమ్ము.

(నిష్క్రమింతురు.)

(తెరనెత్తఁగా రక్తసిక్తాంగములతోఁ బడియున్న జటాయువు.)

రాము:—సోదరా! ఈతండెవఁడో రక్తసిక్తాంగములతోఁ బ్రాణాపాయస్థితినున్నాఁడు. వీనిసేదఁదీర్చి విచారించుచో నిజానిజంబులు తెలియఁగలవు. నీవేఁగి, జలాశయమునుగని, కొంచెము జలముఁదెమ్ము. (లక్ష్మణుఁడు నిష్క్రమించును.) రత్నమయకిరీటం బొండిచటఁబడి యుండుటయెగాక, చాప కాండములుగూడఁ బడియున్నవి. ఈకిరీటచాపంబు లెవ్వనివై యుండును? (లక్ష్మణుఁడు నీరములతోఁ బ్రవేశించును. రాముఁడు, జటాయువునకు నీరుఁద్రావించి, సేదఁదీర్చి)

అయ్యా! నిన్నుఁగన మిక్కుటమగు పరితాపము కలుగుచున్నది. నీయుదంతం బెయ్యది? నీకీదుర్గతినిఁ గలిగించిన పాపకర్ముఁ డెవ్వఁడు? నీనిజవృత్తాంతం బెఱిఁగింపుము?

జటాయువు:—అయ్యలారా! మిమ్ముఁజూడఁ జండకిరణకుల మండనులగు రామలక్ష్మణులరీతి నున్నారు. దశరథుని పుత్రులరు కాఁబోలు. మహనీయులారా! నేను జటాయువను పక్షులఱేఁడను. సంపాతి మదీయాగ్రజుఁడు. రావణుఁడను రాక్షసరాజు, మాతామతల్లియగు సీతాసతినిఁ గొంపోవుచుండ, నమ్మహనీయురాలి సంరక్షణార్థంబా దనుజు నెదిరించి, నేనీదుస్స్థితి కలిగించుకొంటిని. తెఱవకై నాపక్షములఁ దెగనఱికి, రావణుఁడు, సీతాసతినిఁ గొంపోయెను. మీజనకుఁడు దశరథక్ష్మాతలేంద్రుఁడు మదీయమిత్రుఁడు. మహాభాగులారా! మీకీవార్త నెఱిఁగించుటకై యింతవఱకు మనియుండఁ జాలినాఁడ. రామచంద్రా! నాకన్నులు గిఱ్ఱునఁ దిరుగుచున్నవి. మీదర్శనభాగ్యమున నాజన్మము సార్థకమయ్యెను. హా! రామా! సీతాపతీ! రఘువంశతిలకా! (అని ప్రాణములు విడుచును.)

రాము:—లక్ష్మణా! కంటివే! యీపక్షుల ఱేనివిశ్వాసము! మనతండ్రికి మిత్రుఁడఁట. మనకై ప్రాణములఁ గోలుపోయి స్వర్లోకముననుండు మనజనకునకు మనకష్టములఁ దెలుపనేగెను. ఇట్టిమహనీయుని — లోకోత్తర సుగుణభూషణుని — నకారణబంధువును నన్యవిధంబునఁదలంచి చంపనుంకించితివే! హా! సుగుణసాంద్రా! పక్షిరాజేంద్రా! నీకు సమయ

మున నుపకరింపఁ జాలకపోయితినను వ్యసనము నన్ను దహించు చున్నది. సోదరా! ఈమహాత్ముని ఋణంబెన్నటికిని దీర్చి కొనఁజాలము. ఈపక్షిరాజేంద్రునితో క్షణకాలమైనను సంభాషించుభాగ్యము మనకు లేకపోయినదిగదా! ఈతఁడు మనకుఁ బితృసమానుఁడు. కాన, దహనాది సత్క్రియలాచరించి, మఱియు, సీతను వెదకుటకై వెడలుదము.

లక్ష్మ:—అగ్రజా! ఇమ్మహానీయు నన్యవిధంబునఁ దలంచి, దూషించిన యపంథదోషంబు వాయునగ్ని సంస్కారంబొనరింపఁ నంగీకారబొసంగి, నన్ను ధన్యునిఁ జేయ వేఁడెదను.

రాము:-అనూజా! అవశ్యమటులనే యొనరించి, ధన్యాత్ముఁడవగుము.

(తెరలోనికిఁగొంపోయి, యగ్నిసంస్కారముఁ జేయును.)

(తెరపడును.)

శ్రీ

# సీతాన్వేషణము

---

## ద్వితీయాంకము

### ప్రథమరంగము

ప్రదేశము:-అడవి. ప్రవేశము:-రామలక్ష్మణులు.

రా:—లక్ష్మణా! ఈవ్యాళమృగాండజ బంధురాటవినిఁ దిరుగుటకతన నాకాయాసంబగుచున్నది. శమవాయ నొకింత సేపీ భూరుహామునీడ విశ్రమింతమురమ్ము. (అని యొక చెట్టు నీడఁ గూరుచుండి) సోదరా! రావణుఁడను దనుజాధముఁడు పతివ్రతాతిలకంబగు సీతాసతినిఁ గొంపోయెనని పక్షులతేఁడు తెలిపెను. వాని నివాపం బెయ్యదియో తెలియదు. దురాత్ముఁడగు రావణుఁడు నాజాయను హరించెను. క్షణమేనియు నన్ను విడిచి యుండఁజాలని సీతనువిడిచి నేనేగతి తాళువాఁడను.

లక్ష్మ:—అన్నా! ఆయాసం బపనయింపఁ బడెను గదా! ఇంక వెడలుదము రమ్ము.

రాము:—లక్ష్మణా! నావామబాహు వదరుచున్నది. ఆకసంబున గద్దలు పిండుగట్టి తిరుగుచున్నవి. పగటివేళ

నులూాకంబు లఱచుచున్నవి. ఈశకునములఁగన మన కేద్దియో యాపద తటస్థింపనున్నటులఁ దోఁచుచున్నది.

లక్ష్మ:—తాటకాంతకా! పతివ్రతామతల్లియగు సీత పోవుటకన్నను మించినయాపద యున్నదా? ఈశకునము లన్నియు నద్దానినే సూచించుచున్నవి కాని, వేఱొండుగాదు.

గీ. ప్రాణపదమైన సీతను బాసినపుడె
సర్వశూన్యమయ్యె జగతి, సన్నుతాంగ!
ఇంతకన్న నెక్కువ కీడిఁకేమి గలుగు!
వేగఁబోదము వెనుకంజ వేయకింక.

రాము:—లక్ష్మణా! సీతావియోగానలమున దహింపఁ బడుచున్న మనకింకేయాపద తటస్థింపనుండెనో యెఱుంగము. కానివేళలఁ గష్టములు సముద్రతరంగములఁబోలి పైఁబై వచ్చును. నిశాచరుల నిలయంబగు దండకాటవియందుఁ గష్ట ముల కేకొఱంతయు నుండదు.

లక్ష్మ:—భానువంశతిలకా! ముఖాముఖి నిలచి గష్టములఁ గలిగింపఁజాలు సమర్థుఁడు ముల్లోకములం దెందును లేఁడు. అయినను మనము సమరసన్నాహసిద్ధులమై యుండు టయే మేలని తోఁచుచున్నది.

(ప్రవేశము:—కబంధుఁడు)

కబంధుఁడు:—(స్వగ) ఈ మానవులెవ్వరో నిర్భీతి నిటఁగ్రుమ్మరుచున్నారు. అస్మదీయపరాక్రమం బెఱుంగక,

నా యీప్రదేశముఁ జేరుట మృత్యుగహ్వరముఁ జొచ్చుటయ కాదే! వీరి పీఁచమడంచి, రక్తమును ద్రావి, మాంసముఁ గడుపారఁదిని, నా యాఁకలి నడంచుకొందుఁగాక. (ప్రకాశము) ఓరీ! నరకీటకములారా! నాయాజ్ఞఁగైకొనక యీయుగ్రాట విని హరిహరబ్రహ్మాదులైనను జొఱవెఱతురు. సాహసించి మీ రిచ్చటి కరుదెంచుటఁజూడ మీ కాయువు మూడినటులున్నది. వంటయిలుఁజొచ్చిన శశంబులరగు మీ యిరువుర దోర్దర్పమెలర్ప నా బాహుయుగళమున బంధించి, మీప్రాణ వాయువులఁ బోగొట్టెదను. (అని బాహువులుసాఁచి, సమీపించును.)

రాముః—లక్ష్మణా! సుమిత్రాతనూజా!

ఉ. పారములేని శోకపుఁ బ్రవాహమునఁబడి కొట్టుకొంచు నే
దారియుఁ గానరాక, కడుదైన్యముతో మనమేగుచుండఁగాఁ
గారణమింతలేక, యిటుకాలునిరీతినిఁ జంపవచ్చె నీ
క్రూరనిశాచరాధముఁడు, క్రోల్పులిచాడ్పునఁ గూర్మిసోదరా!

సోదరా! యీ దనుజునిచేతులఁ జిక్కితిమా చచ్చుట నిక్కువము. కాన, వీనిబాహువుల మనకృపాణములచే ఖండించుట లెస్స. (అని బాహువుల నఱకుదురు.)

కబంధుఁడు:—(క్రిందఁబడి నిజస్వరూపముఁదాల్చి) మీ పరాక్రమమున నేను విజితుండనైతిని. మీరలెవ్వరో యుదంతంబెఱింగించి, నన్ను ధన్యునిజేయ వేఁడెదను.

లక్ష్మ:—దనుజాధమా! చుట్టఱికము పెంపున మాటాడు నీవు మాతో వియ్యమందనుంటివా? మా కాఁపురంబయోధ్యాపట్టణంబు. ఇక్ష్వాకువంశోద్భవులము. ఈతఁడు రాఘవుఁడు. నే నాతని యనుజుఁడ. లక్ష్మణుఁడ నెడివాఁడను. ఈ దేవప్రభావుఁడు తండ్రి యాజ్ఞానువర్తియై దండకాటవిని ధర్మపత్నిఁగూడి సుఖంబుండ, నసురులు మేమందు లేనితఱిఁగని, మాయచే సీతాదేవిని ముచ్చిలికొంపోవ, నామెను వెతకుచుఁ దిరుగుచున్నాము. దానవా! నీ వెవ్వండవో యెఱింగింపుము.

కబంధుఁడు:—మహాత్ములారా! నే దానవుఁడఁగాను. దనువను దివ్యుండను. నీరజభవునిఁగూర్చి ఘోరతపంబొనరించి, కోరినరూపమును గైకొనునటుల వరంబుఁగైకొంటిని. వరగర్వాంధుండనై, వికృతాకారములఁగైకొని, తాపసపుంగవుల వేమఱుగోడాడించుచుంటిని. సుగుణసాంద్రా! రామచంద్రా! నేనొకనాఁ డీ వికృతరూపమును గైకొని స్థూలశిరుఁడను మునిపుంగవుని నొవ్వఁజేయ నాసంయమి కోపోద్దీపితమానసుండై, 'మదాంధా! నీ వీరూపమున మిన్నుమన్నుఁగానక మునిసత్తముల నొవ్వఁజేయుచుంటివి. నీ కీరూపంబె శాశ్వతంబుగ నుండుఁగాక' యని శాపంబొసంగెను. ఆ వాక్యములు నా వీనులఁబడినంతనె నామనంబెల్ల నీఱుగాఁగ నేలఁబడి, దుఃఖించి, 'మహాత్మా! యౌవన గర్వంబునఁజేసిన తప్పును సైరించి శాపం బుపసంహరింపు'డని వేఁడ నత్తపోధనుఁడు, 'నావాక్యం బమోఘంబు. జరిగియేతీఱు'నని తెలిపెను. నేనంత

మొదలునఱకిన పాదపంబురీతి నేలఁబడి, మఱిమఱిదుఃఖించి, శాపాంతంబైన ననుగ్రహింపుఁడని వేఁడఁగ నా మహాత్ముఁడు కరుణించి;

సీ. గాధినందనుని యాగంబునురక్షించి,
మారీచుతల్లిని ద్రుంచఁజేసి,
పతిశాపవశమునఁ బాషాణమైయున్న
భామినీ యఘమును బాయఁజేసి,
యవనీశ్వరులనెల్ల నవమానపఱచిన
హరువిల్లునవలీల నపుడుదునిమి,
జనకునాజ్ఞనుదీర్ప సౌఖ్యముల్ విడనాడి
వనములసతితోడ వాసముండి,

గీ. రామచంద్రుఁడు, సీతను రావణుండు
చెఱనుగొంపోవ, వెతకుచుఁ దిరిగితిరిగి,
వచ్చి, నీబాహుయుగళంబు ద్రవ్యఁజేయ
స్వస్వరూపంబు చేకూరి స్వస్తికలుగు.

అని నుడివి, యవతారపురుషుండగు శ్రీరామచంద్రుఁడు నీ బాహువుల నఱకినపుడు నీకు శాపవిమోచనంబగునని సెల వొసంగెను. దేవాధిదేవా! దీనజనమందారా! నీ యనుగ్రహమున నా శాపవిమోచనంబయ్యె. నేనిఁక స్వర్గముఁ జేరఁ బోవుచున్నాను. శరణాగతత్రాణబిరుదాంకా! లోకమాత యగు సీతామతల్లిని వెదుక వానరనాథుండగు సుగ్రీవుని చెలిమి యొనర్పుము. ప్రశస్తపరాక్రమశాలియగు జలజాప్తునూనునికి నిర్జరారుల యిక్కలెఱుంగనియవి లేవు. సురగరుడోరగ

యక్షకిన్నరకింపురుష సిద్ధసాధ్యరాక్షసలోకము లెందైన రావణునిచే దాఁచఁబడినను దెలియశక్తుఁడు.

రాము:—అనిమిషవరేణ్యా! సూర్యపుత్రుని చెలిమి యొనరించిన మాకార్యం బనుకూలించునా? సూర్యసూతి నివాసం బెయ్యదియో తెలుపఁగోరెదను.

కబంధుఁడు:—జానకీరమణా! సుగ్రీవుఁడగ్రజున కాత్మఁ దలంకి, పంపాసరోవరప్రాంతదేశంబునఁ జరించుచున్నాఁడు. జగదభిరామా! నీకు శుభంబయ్యెడు. మీదర్శనార్థం బెనురు చూచుచుండు శబరికి మీదర్శనంబొసంగఁ బ్రార్థించెదను. మహాత్మా! ఇంక నేఁబోయివచ్చెదను. సెలవొసంగుఁడు.

(నిష్క్రమించును.)

రాము:—అనుజా! లక్ష్మణా! జటాయువు మన కెఱిగించిన రావణుఁడు సీతాసతి నెందుదాఁచియుంచినను సుగ్రీవుఁడను వానరాధిపతి కనుఁగొనఁజాలుననియు, వనచరనాథు సఖ్యంబొనరింపుమనియు నీ దివ్యుఁడు వాక్రుచ్చె. సోదరా! త్వరితగతి కీశాధిపతిఁ జేరి సఖ్యంబొనరింప నా మనం బుత్తలపడుచున్నది.

లక్ష్మ:—రమారమణా! సీతాన్వేషణార్థంబు సుగ్రీవు సఖ్యంబొనరింపకపూర్వమే, మతంగాశ్రమముఁ జేరి, ధర్మచరిత్ర యగు శబరికి దర్శనంబొసంగఁ గడంగుట యుచితంబని తోఁచుటలేదా?

రాము:—లక్ష్మణా! లక్షలకొలఁదిగ నిడుమలుచుట్టు ముట్టినను భక్తుల నొకింతయేని నుపేక్షింపజనదు. కావున, పరమభక్తాగ్రేసరియగు శబరికి మునుముందు దర్శనంబొసంగుటయె ధర్మంబని తోఁచుచున్నది. సోదరా! కాలయాపనం బొనరింపక, మతంగాశ్రమమును జేరి, శబరికి దర్శనంబొసంగి, సీతాన్వేషణమునకుఁ గడంగుదము. (నిష్క్రమింతురు.)

# ద్వితీయాంకము

## ద్వితీయరంగము

స్థలము:_మతంగాశ్రమభూమి ప్రవేశము:—శబరి

శబరి:——మదీయగురుండగు మతంగుఁడు పరమపదించునపుడు నన్నుఁజేరి, 'సుదతీ! నీ సపర్యలు శ్లాఘ్యంబులు. నియతిఁదప్పక నన్ను సేవించి ధన్యురాలివైతివి. శ్రీరామచంద్రుఁ డనుజసహితుఁడై యిచ్చటికరుదెంచును. అమ్మహనీయునిఁ బ్రీతిఁ బూజింపుము. నీకు స్వర్గసుఖం బొసంగు'నని సెలవొసంగెను. ఏకమాత్రనై యిన్నిదినంబు లిందు రామస్మరణమె ప్రాణంబుగఁదలంచుచుఁ గాలముగడుపుచున్నను లోకైకనాథుఁడగు రామచంద్రుని దివ్యదర్శనం బొదవదయ్యెను. దశరథరామా! భక్తులపాలిటి కల్పతరువవుగదా నీవు. జాతిని నాతిగఁజేసిన దయామయుఁడవు. అట్టి నీకీ దాసురాలియం దనుగ్రహమేల జనింపకున్నది?

ఉ. ఎన్నఁడుఁ గాంచఁగల్గుదునో? యెందులనుండెనో? రామచంద్రుఁ, డా
పన్నజనాళిబాధలను బాపఁగఁజాలెడు బాంధవుండు, నా
కన్నివిధంబులన్ సుఖములబ్బఁగఁజేయఁగఁ జాలునంచు, నే
నెన్నిదినంబు లోర్చుకొని యీగతినుందును గాననంబులన్.

ఎన్నఁడు నా కన్నులకఱవుదీఱ నా కాంచనచేలుని గాంచఁ గలుగుదును? (దృష్టిసారించి) అల్లదే! ధనుర్బాణధారులై,

షోడశకళాపరిపూర్ణ సుధాంశుఁదిరస్కరింపఁజాలు వదనంబులు గలిగి, జటావల్కలధారులై, యిరువు రిచ్చోట కరుదెంచు చున్నారు. వీరెకాఁబోలు శ్రీరామలక్ష్మణులు. ఆహా! నాభాగ్యమేభాగ్యము. లోకైకనాథు సేవింపఁజాలుభాగ్య మును గాంచఁగలిగితిని. గురుశుశ్రూషాఫలం బెన్నటికిని రిత్త వోదుగదా! నా యోపినకొలఁది ఫలపుష్పములచే వీరినిఁ బూజించి ధన్యనయ్యెదఁగాక!

(ప్రవేశము:—రామలక్ష్మణులు.)

రాము:—సోదరా! లక్ష్మణా! కృశించి ముడుతలు వడ్డ దేహమును, దంతములు డుల్లినవదన గహ్వరమును, నెఱసిన శిరోజములను గలిగియుండు నా తరుణీమణియె కాఁబోలు ననిమిషుఁడు మన కెఱింగించిన శబరియను మతంగ మునీంద్రుని శిష్యురాలు.

లక్ష్మ:—ఇక్ష్వాకు కులాలంకారా! జగదభిరామా! తపోనిష్ఠాగరిష్ఠుండగు మంతంగుని శుశ్రూషలఁదనియించి, గురుకృపకుఁ బాత్రురాలై, స్వర్లోక సౌఖ్యములఁ జూఱఁగొన మిమ్మనవరతమాత్మఁ దలంచుచు, మీదివ్యదర్శనమున కెదురు చూచుచుండు నీ సిద్ధసమ్మతయగు సిద్ధురాలి తేజము దుర్ని రీక్ష్యంబై యున్నది. ఇత్తపస్విని కోరికెలీడేర్చి వరదనామంబు వఱలనిమ్ము.

(శబరి రామలక్ష్మణులను సమీపించి మ్రొక్కును.)

రాము:—అమ్మా! నీకు శుభంబయ్యెడు. ఏ కొఱంతయులేక యిందు సుఖంబుగ నుంటివే? నీతపోవ్రతంబులు నిర్విఘ్నంబుగఁగొనసాఁగుచున్నవి గదా?

శబరి:—లక్ష్మీరమణా! లోకారాధ్యా! నానియమంబులకే కొఱంతయుఁ గలుగుటలేదు. తపోధనుండగు మద్గురూత్తముఁడు స్వర్గమును జేరఁబోవుచు నియ్యెడఁ జేరఁగ వచ్చిన మిమ్ముఁ గాంచినంత నవ్యయంబగు నుత్తమలోకము లబ్బునంచుఁజెప్పి దివంబునకేగెను. సమ్మదమెదఁ గ్రమ్మ మంచి వన్యఫలసంతతుల మీకొఱ కాయత్తపఱచియున్నదానను. వీనిఁదృప్తిమెయి నారగించి, నాకానంద మొసంగఁ గోరుదానను. (అని ఫలముల నిచ్చును.)

రాము:—అమ్మా! సచ్చరిత్రా! నీయతిథి సత్కారమునకే నెంతయు సంతసించితిని. నీ నియమితతపంబు పెంపునఁజేసి నాయనుగ్రహమును గలిగి దివ్యదేహవగుచు స్వర్గముననుండు నీగురు సన్నిధిఁ జేరుము. మేమును బంపాసరోవర ప్రాంతమును జేరఁబోయెదము.

శబరి:—మహాత్మా! కలయందైన నిన్నెఱుంగనట్టి మహాకష్టాత్ములగు దుర్బలులకు సహిత మా పత్కాలమున నిన్నెదఁదలంచినంతఁ గరుణమెయి నుత్తమలోకముల నొసంగెదవు. నిన్ననవరత మాత్మఁదలంచి ధ్యానించుచుండు నాకు స్వర్గ సుఖంబనుగ్రహించుట యబ్బురమా! కరిరాజవరదా! కాకుత్స్థవంశాగ్రణీ! నాభాగ్యంబు పెంపున మీ యనుగ్ర

మున కేను పాత్రురాలనైతిని. కోదండరామా! మీాయమో ఘాశీర్వచన ప్రభావంబునఁజేసి స్వర్లోకముననుండు గురుఁజేరఁ బోవుచున్నాను. ఆజ్ఞ నొసంగుఁడు. (శబరి దివ్యదేహయయి విమానమున స్వర్గమున కేగును.)

రాము:—లక్ష్మణా! కబంధవధయు, శబరీ దత్తఫలాశనమును ముగిసినవి. ఇఁక, సీతాన్వేషణార్థమై సుగ్రీవుని సఖ్యం బొనరింప ఋష్యమూకాద్రినిఁ జేరఁబోవుదముకమ్ము.

లక్ష్మ:—ప్రసాదము. (రామలక్ష్మణులు నిష్క్రమింతురు.)

# ద్వితీయాంకము

## తృతీయరంగము

స్థలము:—ఋష్యమూకపర్వతము.
ప్రవేశము:—సుగ్రీవుఁడు మంత్రులఁగూడి.

సుగ్రీవుఁడు:—సచివచంద్రములారా! ఇంద్రసూనుని పరాక్రమంబెదఁదలంచినపుడంతయు నాడెందమునం దనివార్యం బగు భయంబుప్పతిలుచుండును. నిర్దోషినగునాయందు సుమంతయు నక్కటికము లేక, సత్యాసత్యములనొకింతయు విమర్శింపక, నన్నిట్టియిక్కట్టుల పాలుసేయుట యుచితమా?

గీ. కులసతినిఁబాసి, తినుటకుఁ గూడులేక
కఠినవనములఁదిరుగాడఁ గలిగె నకట!
ఇంద్రసూనునిదౌష్ట్యమోయిం గలమును
బోలెఁగాల్చెడు, ప్రాణంబు వోవదయ్యె.

అక్కటా! దుర్మదాంధుండగు దుందుభి యుక్త్యాయుక్తముల నించుకయు నాలోచింపక, ప్రశస్తపరాక్రమశాలియగు వాలిని గయ్యమునకుఁజీర నేల? రాక్షసమాయాంధకారమునఁ జిక్కి, గుహాంతర్భాగమున రణం బొనరించుచుండు మదీయాగ్రజుఁడు నిహతుండయ్యెనని మనంబునఁదలంచి, యితర మార్గంబుఁగానక, భయాభ్రాంత చిత్తుండనగుటంజేసి గదా, గుహాముఖమున కా పెనురాతినడ్డంబువేయుట! నిజానిజంబులఁ

దెలిసిగదా ననుదండింపవలయును! సోదరుఁడని యింతైనఁ దలంపక, కాలఁదన్ని, నాజాయనుహరించి, నాకుఁగూర్చెడు మంత్రి పుంగవులనెల్ల మన్నింపక, చెఱయందునిచి, వారి సర్వస్వముఁ గైకొని, నన్నీగతి కాంతారవాసుఁ జేయు టుచి తమే? ఈకడ గండ్లెన్నటికినిఁ బాయవు కాఁబోలును!

గీ. భోగభాగ్యాదులెల్లఁ బోఁగొట్టుకొనియు
నగ్నిసాక్షిగఁ గైకొన్న యతివమిన్న
నకట! విడనాడి, ఋష్యమూకాద్రిఁజేరి,
కందమూలంబులను దిని కుందవలసె.

మతంగ మునీంద్రు నుగ్రశాపమునకు వెఱచి, వాలి యిటకురాజంకుచుండెను గాని, లేకున్న నేనీపాటికి యమపు రంబునఁ బ్రాఁతకాఁపునై యుండవలసిన వాఁడనే.

నీలుఁడు:—రాజచంద్రా! రవిపుత్రా! కష్టసుఖములు కావడికుండలఁ బోలి యుండుననుటెఱుంగవా? ఇంగితజ్ఞుఁడ వగు నీవిట్లాలోచింప నవ్వు జనించుచున్నది. బాహుబల గర్వ మదాంధుండై, కన్నుఁగానక, వాలి చేసిన చెయిదములు దూష్యములనుట లోకవిదితంబు. కాల మాసన్నమగు నందాక నిబ్బరముగ నుండఁజనును. న్యాయాన్యాయముల వివక్షించి, నారాయణుఁడు దుష్టులఁదప్పక శిక్షించును. ఇంత వఱకు దుర్మార్గులెవ్వరును బాగుపడియుండలేదు.

సుగ్రీ:—ప్లవగ గోలాంగూల భల్లుక యోధవరేణ్యు లారా! ధీరోదాత్తులారా! సోదరుఁడు లేకున్న రాజ్యమాది

భోగంబులేల యని యే నెన్ని విధంబుల వలదన్నను మీరెల్ల రొడంబడక నన్ను సింహాసనాసీనుఁ జేసితిరిగాని, నేనభిల షించితినా! ఈ యుదంతమునొకింతయు నెఱుంగఁ దలంపక, నన్నీగతిఁ గాంతారముల కనుపుటయెగాక, నన్ను వధింప నెందెందఱినో పంపుచుండుట మీ కెఱుంగని విషయంబు గాదు. కులసతినిఁ, బ్రాణబంధువుల, నాప్తమిత్రులను సహితము విడనాడి, తుదకీగతి దుఃఖింపవలసిన వాఁడనైతిని. ఇతర కార్యములనెల్లఁ బోవిడిచి, దినగండమును దప్పించుకొని, ప్రాణరక్షణార్థం బీగతిచోరుని రీతి స్వేచ్ఛయొకింతయు లేక, తిరుగవలసిన వాఁడనైతిని.

హనుమంతుఁడు:—నీరజమిత్రనందనా నినుఁబోలు ధీరసత్తములు కష్టసమయములందు ధైర్య మూనవలయును గాని, వగచుటపాడిగాదు. ఇష్టజనంబులఁ బాసినంతనే తీవ్రదుఃఖమున మునుంగఁజనునా! ఉత్సాహవంతుఁడగు వానికి దుస్సాధ్యంబగున దెద్దియును నీ భువినిలేదు. కాన, చింతలు డిగి, నెమ్మదిగ నుండుము. అధైర్యమును వదలుము. తావక కృపాకటాక్షమునఁ దేజరిలు మేమిందఱమిందుండ నీ కేటి కీ భయము?

సుగ్రీవుఁడు:—సమీరనందనా! నాకొఱకొకింతయు నే నాయాసపడుటలేదు. కాని,

గీ॥ తల్లిదండ్రులఁబాసి నాదండ మీరు
కందమూలంబులఁ దిని కాననములఁ

గష్టములకోర్చి యుండుటఁ గాంచలేక
చింతనొందుదు నెప్పుడు స్వాంతమందు.

(దృష్టిసారించి) మారుతీ! శరచాపధారులై యిచ్చోట కరు దెంచు నాదేవ సమానరూపులఁగాంచుము. వారినిఁ గనినంతనే నామనమున శంక వొడముచున్నది. వాలిచేఁ బ్రేరేపింపఁబడి, మనలఁ జంపనిటకరు దెంచుచున్నారు కాఁబోలు! ఇంకేది తెరువు? లేకున్న తాపసులకేల శరచాపంబులు?

హను:—వానరేశ్వరా! వారి ముఖవికాసములఁ దిల కింప సుక్షత్రియకులజులఁ బోలియున్నవి. అకారణముగ మన కాపదఁగలిగింప నమ్మహనీయు లేల సమ్మతింతురు. మీర లనుభవించు నీ కష్టములకతమున మీ కిట్టి యూహలు జనించుచున్నవి కాని, వేఱుగాదు. నే నరిగి వారి వృత్తాంతం బరసివచ్చెదను. అంతవఱకు నెమ్మదినుండుఁడు.

సుగ్రీ:—అంజనాసుతా! అరమరలేక నీవరిగి, నీ నేర్పు పెంపున మెలంగి, వారి సత్యాసత్యముల నరసిరమ్ము.

హను:—ప్రసాదము. (నిష్క్రమించును)

(తెరయెత్తఁగా రామలక్ష్మణులు ప్రవేశింతురు).

రాము:—లక్ష్మణా! ఆ దివ్యపురుషుఁడు తెలిపిన ఋష్యమూకాద్రి యిదియె కాఁబోలునని తోఁచుచున్నది. దీని వైభవం బెన్ననావేయి ఫణులశేషునకైనఁ దరంబుగాదు కదా! దీని రామణీయక మెంతని పొగడవలయును. మధుర ఫలభరితంబులౌ మహీరుహములును, ఘుమఘుమమను వాస

నల వెదఁజల్లు సాంద్రనికుంజపుంజ లతావిశేషంబులును, నిర్మల వారి పూరములగు కొలంకులును, సెలయేళ్లను గాంచ మిక్కుటమగు నానందమొసంగుచున్నది. ఇదియె కాఁబోలు సూర్యసూతినివాసంబగు ఋష్యమూకాద్రి. మన మాతని సఖ్యంబొనరించు టెటులనో తెలియకున్నది. అతనికడకు మన మేగుచో మనల నాతఁడు మన్నించునో? మన్నింపఁడో?

లక్ష్మ:—అగ్రజా! అరవిందదళాయతాక్షా! అగ్రజన కాత్మఁదలంకి, యిందుఁ జరించుచుండు వృక్షచరాధినేత మనల నవశ్య మాదరించును. అతఁడు కర్తవ్యాకర్తవ్యముల నెఱుంగఁజాలని మూర్ఖుఁడుగ నుండజాలఁడు. తప్పక మనకు సహాయమొనరింప సమ్మతించును.

రాము:—అనుజా! అవనిజను గోలుపోయి, యడవుల యందుఁ దిరుగుచు దుఃఖవారాశిని మునింగిన మనలను సుగ్రీవుఁడు నావయై దరిఁజేర్పఁగలండను నాశ మిక్కుటముగ నున్నది. ఎన్నివిపత్తు లడ్డువచ్చినను జానకి లభించు మార్గ మును సుగ్రీవుఁడు సూపుననియే తోఁచుచున్నది.

లక్ష్మ:—మునికృతయాగరక్షా! అటుసూడుము. ఎవ్వండో యొకవానరుం డిట కరుదెంచుచున్నాఁడు.

(ప్రవేశము:—హనుమంతుఁడు)

హను:—(స్వగ) ఇమ్మహనీయులఁ గన్నంతనే నా డెందమున నెనలేని భక్తిభావం బుదయించుచున్నది. హార్యక్ష

విక్రమములం బోలు పీ రవతారపురుషులగుదురు గాని నిక్కంపు మానవులు గారు. సామాన్యమానవులం దిట్టి తేజోవిలాసంబు లుండుననుట కల్ల. వీరి ముఖాలోకనమాత్రమున నా యొడ లుప్పొంగుచు నెనలేని సంతసము కలుగుచున్నది. వీరినిం జేరి, యుదంతంబరసెదంగాక! (అని రామలక్ష్మణుల సమీపించి) మహాత్ములారా! నమస్కారములు. (అని నమస్కారముం జేయును).

రామ, లక్ష్మ:—ఓయీ! వృక్షచరా! నీవెవండవు? ఏ కార్యార్థివై యిట కరుదెంచినాండవు? విశదముగ నెఱింగించి మమ్ము ధన్యులం జేయుము.

హను:—మహనీయులారా!

గీ. వాయుదేవుని సుతుండనై వఱలువాండ,
అంజనాదేవి నాతల్లియై తనర్చు,
సూర్యపుత్రుని సచివుండంజూండి నేను,
పేరు హనుమంతుండందురు పృథ్వినన్ను.

ఆర్యులారా! నేను వాయుపుత్రుండను. ఆంజనేయుండను పేరం బరంగువాండను. కిష్కింధాధిపతియగు వాలి సోదరున కేను ముఖ్యమంత్రిని. ఇంద్రసూతికాత్మం దలంకి యీ పర్వతారణ్యములం దిరుగు సుగ్రీవుండు మిముంగాంచి భీతిలి, మీ యుదంతంబెఱుంగ నన్నిటకుం బుత్తెంచెను. మా సంశయములు వాయ మీ యుదంతంబెఱింగించి నను ధన్యునిం జేయ వేండెదన్నా. భద్రసింహాసనార్హులగు మీరు రాజోచిత

ములగు వస్త్రభూషణములఁ గై సేయక, యీగతి నారచీరలఁ గట్టి, కాంతారములయందుఁ గ్రుమ్మరుచుండుటేల?

రాము:—హనుమంతా! మే మయోధ్యాధినేతయగు దశరథుని పుత్రులము. నాపేరు శ్రీరాముఁడు. ఇతఁడు మదీయ సోదరుఁడు—లక్ష్మణుఁడు. తండ్రి యాజ్ఞానువర్తినై, యను జన్మందును, సతివయు వెన్నంటిరాఁగ, జిత్రకూటాద్రినిఁ బర్ణశాల నిర్మించుకొని యుండ, రావణుఁడను నిశాచరనాథుఁడు నా సతిని మే మందు లేనియద నెఱిఁగి యపహరించెను. తత్కారణమున మేమిరువుర మీ యుగ్రాటవినిఁ దిరుగుచు, దనువను దివ్యమూలమున మీ ప్రభువగు సుగ్రీవునివార్త నెఱిఁగి, యతనితో సఖ్యంబొనరింప నేతెంచినారము. కాని, వాలిచే బంపఁబడిన శాత్రవులము గాము. సువర్ణహస్తకంకణములను ధరించియుండు నో వానరవీరా! మీ ప్రభువునకును, మాకును సఖ్యంబొనరించి మమ్ము ధన్యులఁ జేయుము.

హను:—(స్వగ) పుట్టుకతోడఁ గలిగిన యీ సువర్ణహస్తకంకణములు పరులకన్నుల కగోచరములుగదా! ఇమ్మహనీయుఁ డేగతి కనుఁగొనఁజాలెనో తెలియకున్నది. ఇతండె కాఁబోలు సన్నెరెడు నారాయణుఁడు. సుగ్రీవున కీతనితోడి సఖ్యంబొనగూర్చి, యీతని కేను బంటునై కొలుచుచు, శాశ్వతకీర్తిఁ బడయుదుఁగాక! (ప్రకాశము) మహాత్ములారా! నేను మునుముందుగఁబోయి మా ప్రభువున కీ శుభవార్త నెఱిఁగించి, భీతిఁబాపెదను. మీరును నా వెనువెంట రండు.

రాము:—హనుమంతా! అవశ్యమటులనే యొనరింపుము. (హనుమంతుఁడు నిష్క్రమించును)

రాము:—లక్ష్మణా! ఈతని వినయవిధేయతలను గాంచ మిక్కుటమగు సంతస మొదవుచున్నది. నివురుఁగప్పిన నిప్పుఁబోలియుండు నీతఁడు మన కుపకారియగునని మనమునఁ దోఁచుచున్నది. వాయుసూనుఁ డెఱింగించినరీతి మనమును సుగ్రీవునిఁ జేరఁబోవుదము రమ్ము.

లక్ష్మ:—చిత్తము. వెడలుదము రండు. (అని నిష్క్రమింతురు)

(తెరపడును)

శ్రీ

# సీతాన్వేషణము

---

## తృతీయాంకము

### ప్రథమరంగము

స్థలము:—ఋష్యమూక పర్వతమున నొక చెట్టునీడ.

(ప్రవేశము:—రాముఁడును, లక్ష్మణుఁడును గూరుచుండి యుండ సుగ్రీవుఁడు, హనుమంతుఁడు మొదలగు వానరులు నిలచియుందురు).

రాము:—హనుమంతా! ఆపద్బాంధవుఁడవై యనిల సూతికిని మాకును సఖ్యంబొనరించితివి. ఇట్టి సదసద్వివేక సంపన్నుఁడవగు నీ కేమి యుపకృతిసేయఁగలవాఁడను.

హను:—మహాత్మా! మీ చరణదాసుఁడనగు నన్నిటు లగ్గింపనేల? సుగ్రీవుని యుదంతంబంతయు నెఱింగియున్నారు గదా!

దుర్మార్గవర్తనుఁడగు వాలిని సంహరించి, కిష్కింధా రాజ్యమున కీ సుగ్రీవు నధిపతిఁజేయుము. దేవాధిదేవా! కారణజన్ములరగు మీ కీయిల నసాధ్యమగున దేద్దియులేదు.

సుగ్రీ:—క్షత్రియకులచూడామణీ! రామచంద్రా!

గీ. అవనిభారంబుఁ దీర్పఁగా నవతరించి
నట్టి దేవదేవుండ వీ వగుదుఁగాద!
నీదు మహిమంబుఁ గనలేక నిన్నుఁగాంచి
సంశయించితి మదిలోన సారసాక్ష!

మహాత్మా! నేనెంతయు ధన్యుండ నైతిని. తొలుత, మిమ్ముల దవ్వులఁగాంచి, శాత్రవులని భీతిల్లితిని. నా పూర్వ పుణ్యవశంబున మీరు శత్రువులుగాక, నాకాప్తులరైతిరి. హనుమంతునిమూలమున మీవృత్తాంతమంతయు నెఱింగితిని. సీతాన్వేషణమున మీకుఁ దగినంతసహాయ మొనర్తును. జల రాసులింకినను, భూమ్యాకాశంబులు తలక్రిందులైనను, సూర్య చంద్రులు గతులుదప్పినను, జ్వలనుఁడు చల్లఁదనము వహించి నను, నాప్రతిన కన్యథాత్వ ముండదనియెఱుంగుఁడు.

రాము:—సుగ్రీవా! ఇంక భయంబుడిగి నెమ్మదిఁ గనుము. నిన్నిట్టి యిక్కట్టులపాలొనరించిన వాలినిఁబరిమార్చి శాశ్వతసౌఖ్యం బొనగూర్చెదను.

ధ్రువకోకిల. పరమనీచుని, వానరేంద్రునిఁ, బాపకార్య కుతూహలుౝ,
గరుణఁజూపక చెండివైచెదఁ గాండసంతతితోడుతౝ;
అరయఁబండెను వానిపాపము లక్కటా! యిటుసేయుటౝ;
గరముసంతస మొందుమింకను గాంక్షలెల్లను దీరెడుౝ.

సుగ్రీ:—ఆపద్బాంధవా! రామచంద్రా! రక్షింపఁ బడితిని.

రాము:—వనజమిత్రనందనా! సుగ్రీవా! ఇంకను వినుము.

గీ. అమరసంతతి వచ్చి నన్నాఁపుఁగాత,
సమరమందున నిలువక సాగరంబు
నందు డాఁగినఁ జంపెదఁ గుందకయ్య,
చింతతెల్లను బాయుము శీఘ్రగతిని.

లక్ష్మ:—అన్నా! అన్యాయముగ వాలినిఁ జంపుట ధర్మంబే? మహాత్ములరగు మీరిట్టికార్యమునకుఁ గడంగి, యిట్టి ఘోరప్రతిన యొనర్పఁజనునే? కించిదజ్ఞుఁడనగు నా విన్నపమాలకించి, యీయుద్యమమును మరల్పవేఁడెదను.

రాము:—అనుజా! లక్ష్మణా! బాలుండవగుకతన క్షత్రియధర్మంబెఱుంగక యిటులాడుచుంటివి గాని, వేఱు గాదు. వాలి పరసతీలోలుండగుటచేఁ బాపాత్ముండయి వధ్యుండయ్యెను. క్షత్రియులకు దుష్టులఁదునుముటయందుఁ బాపంబులేదు.

హను:—(స్వగతము) ఈమహనీయుఁడు వైకుంఠ నిలయుండగు నారాయణుండుగాని, సామాన్య మానవుం డగునే! మున్నీతని ధిక్కరించి, దైత్యులకభయమొసంగిన భృగుపత్నిని నీతఁడు దునుముటకతన నమ్మహాముని క్రోధించి నరజన్మమెత్తి భార్యావియోగ మొందునటుల నీతని శపించెను. ఆశాపఫలంబనుభవింప నరజన్మమెత్తి భార్యావియోగ మొందుచున్నాఁడు. కాని, వేఱొండుగాదు. (ప్రకాశముగా)

మహాత్మా! తారకనామా! సకలజీవరాసులను మాయా సాగరమునఁనుంచి, ప్రపంచనాటకమునకు సూత్రధారుండవై యొప్పు నీవు ధర్మపత్నిఁ గోలుపోయి పరితపించుట, లోకమునకు నీతులఁగఱపుటకేకాక, మఱొండగునా? రామా! అట్టి లోకోత్తరుఁడవగు నీదర్శనభాగ్యము లభించుటఁజేసి, మేమెంతయు ధన్యులమైతిమి.

లక్ష్మ:—మహాత్మా! సత్వరంబున వాలిని సంహరించి యీసుగ్రీవునకు రాజ్యాధిపత్యమొసంగుము. వెనువెంటనే, సీతాన్వేషణమునకుఁ గడంగవచ్చును.

రాము:—సుగ్రీవా! ముందుగ నీవేఁగి, సత్వరంబున వాలిని సమరమునకుఁ బిలువుము. అభిమానధనుఁడును, ఆత్మబలగర్వాంధుఁడు నగు వాలి, నీతో సమరమునకుఁ దలపడును. నేను మఱుఁగుననుండి చేయవలసిన కార్యమును జేసెదను.

సుగ్రీ:—మహాత్మా! ఆజ్ఞాబద్ధుఁడ నయ్యెదఁగాక.

(నిష్క్రమించును.)

# తృతీయాంకము

## ద్వితీయరంగము

స్థలము:—కిష్కింధాపురమున వాలియంతఃపురము.

ప్రవేశము:-వాలి భార్యయగు తారఁగూడి.

తార:—నాథా! కపికులసార్వభౌమా! భవద్భ్రాతృ దతికి వెఱచి, సత్త్వవిహీనుఁడయి పాఱినరవిజుఁడు, మరల నిపుడు కయ్యమునకుఁ జేరుట చిత్రముగాఁ దోఁచుచున్నది. అర్కవంశసంజాతులు-దశరథక్ష్మాతలేంద్రుని తనయులు-రామలక్ష్మణులను వారలు మీతమ్మునికిఁ దోడుపడ వచ్చినవారని మన యంగదునివలనను వినియున్నదాన. సమరదుర్జయులగు రామలక్ష్మణులు మీకెద్దియేని కీడొనరింపక పోరను శంక పొడముచున్నది. నాథా! నావిన్నపమాలకించి, నేఁటికీ యుద్యమమును జాలింపుఁడు.

వాలి:—ప్రేయసీ! వీరపత్నివగు నీవిట్లాడ నవ్వు జనించుచున్నది. క్షీణపరాక్రముఁడగు సుగ్రీవుఁ డాహవమున కాహ్వానించుచు సింహనాదముఁజేయుచుండ నేనిందంతఃపురమున ముచ్చటలాడుచునుంటఁ బాడియా? కాంతా! ధర్మతత్పరులగు ధారుణీపతు లధర్మచిత్తులై నాకేల కీడుచేయఁదలంతురు. నిర్నిమిత్తపాపమునకు వారేల యొడిగట్టుదురు?

గీ. 'రామచంద్రుఁడు నాకేల రణమునందుఁ

గీడు సేయఁగ నెంచుఁదాఁ బాడివీడి;

ధర్మతత్పరుఁ డాతఁ డధర్మవృత్తిఁ
బూనఁడంచును దలఁపుము పుష్పఁబోఁడి.

తార:—నాథా! అబలనగు నేను మీకుపదేశించు నంతటి దానఁగాను. చనవుపెంపున నేనాడెడుమాటలకుఁ గినియకుఁడు. యౌవరాజ్యమునం దారవిసూనునిలిపి, రామలక్ష్మణులతోఁ జెలిమియొనర్పుము. సవినయుండును, గుణోత్తరుండునగు తమ్మునితో వైరమేల? ఆతఁడేకగర్భజనితుండగు తమ్ముఁడుగాని దాయగాఁడు. అట్టివానిఁ జంపఁ బూనుటేల?

వాలి:—అతివా! ద్వేషియై, కన్నుఁగానక నన్నుఁ గయ్యమునకుఁ జీరుచుండ భోగము లనుభవించుచునుండ మందునా? పడఁతీ! పరిపంథిజనమొనర్చు పరిభవమునకన్న మృత్యువే మేలు. ఇంక నీవాచాలత్వముడిగి యంతిపురినిఁ జేరఁబొమ్ము. కాంతా! ప్రాణములఁ గొనక, కాష్ఠముష్టుల నీమఱంది దోర్బలగర్వమణంచి వచ్చెదను. (నిష్క్రమించును.)

తార:—అక్కటా! నాథునివారించుట నాకసాధ్యమయ్యెను. పెక్కువశకునములు గానఁబడుచున్నవి. విధిప్రేరితుఁడగు నీతనికి నాహితోక్తులు రుచింపవయ్యె. ఇంకేది తెరువు? సర్వమున కారాముఁడె దిక్కగుఁగాక!

(అని నిష్క్రమించును.)

తెరయెత్త:—కిష్కింధాపురసమీపమున బయలుప్రదేశము.

(వాలిపడియుండ రామలక్ష్మణ సుగ్రీవ హనుమదాది వానరులు నిలచియుందురు.)

వాలి:—రామా! రఘువంశదీపకా! కడుపాఱఁద్రావి నిదురించిన త్రాగుఁబోతుపాముచేఁ జచ్చినటుల శౌర్యకలితుండనయ్యుఁ జాటుననుండు నీచే మృతిఁ గనవలసె.

ఉ. మానితసర్వసద్గుణ సమంచితవిక్రమ ధుర్య, రామ! యో
మానవలోకపాలకకుమారక! ధర్మమునెల్ల వీడి యా
మ్రానులఁ గొమ్మలక్కలతల మాటున డాఁగియుఁ జంపఁజెల్లునే?
మానుగ నింతకంటె నవమానము లేదుగదా, ధరాస్థలిన్.

శాస్త్రజ్ఞానవేదియగు క్షత్రియకులాలంకారున కిట్టి నీచప్రవర్తనమే గతికలిగెను? పచ్చికకప్పిన పెనుబావిఁ బోలియుండు నిన్ను మాయలమారివని తలంపక, మతివిహీనతచే, జన్యమునకుఁ బోవలదని తార యడ్డగించినను వినక వచ్చి యిం దధర్మయుద్ధమునఁ జచ్చితిని. భార్యావియోగమున మతి సెడియున్న నీకు ధర్మాధర్మవిచక్షణ లెక్కడినుండి వచ్చును. నీకు సుగ్రీవుఁడు సహాయమొనరించుననిక దా న న్నధర్మయుద్ధమున వధించితివి. ఇంచుక నాకాజ్ఞయిడియుండిన నాపదితలల పురుగగు రావణునిఁదెచ్చి, నీపాదాక్రాంతుఁ జేసియుండనే?

రాము:—వనచరాధిపతీ! ధర్మమునెల్లను బోవిడిచి, గర్హితకర్మచారివై నీతిఁదప్పి, నీతమ్ముఁడు సుగ్రీవుఁడు ప్రాణములతోనుండ, నీమఱఁదలగు రుమాసతినిఁ గూడితివి. కామ

వృత్తిని దురితంపుఁబద్ధతినిఁ గ్రొక్కుట న్యాయమందువా? సుతతోడను, చెలియలితోడను, దమ్ముని భార్యతోడను, దగులముగలకుమతికి దండనవిధి శాస్త్రంబున వధయొక్కటే నియమితంబై యున్నది. క్షత్రియాన్వయమునఁ జననమొందిన దానికి దుర్జనశిక్ష యొనరించు టావశ్యము. మాటునుండి చంపితినని మరిమరిఁ బలుకకుము. మృగంబులఁజేరిన నిన్నే విధంబునఁజంపినను బాపంబులేదు. వానరేశ్వరా! దుష్టసంహారమే కర్తవ్యమగుట నిట్లాచరించితిని.

వాలి:—పరంధామా! శ్రీరామచంద్రా! పరమార్థతత్త్వకోవిదతల్లజుఁడవగు నిన్నకారణముగ నిందించినందులకేను జింతిలుచుంటిని. దాశరథీ! నా ముద్దుసుతు నంగదుఁదలంచినంత నామనంబునీఱగుచున్నది. భరతలక్ష్మణశత్రుఘ్నులపై నీచూపెడిప్రేమయే నా తనయునిపైఁజూప వేఁడెదను. అంతకన్న నేఁ గోరున దేద్దియులేదు. నీ నామస్మరణముఁ జేయుచు జీవములఁ బాయువాఁడను. అదియే నాకు ముక్తిదాయకమగును గాక!

(తెరలో) తార:—హా! జీవితేశ్వరా! కయ్యమున కరుగవలదని నే నెంత వారించినను వినక రణమునఁ గూలితివా! అభయప్రదుఁడగు రాఘవుఁడు నీ కీగతి భయప్రదుం డెటులాయెను? ఇంకేది తెరవు?

రాము:—(వినుట నభినయించి) మారుతీ! ఆ వినంబడెడి యార్తనాదం బెవరిది?

హను:—మహాత్మా! వాలి ధర్మపత్నియగు తార విలపించుచు నంగదునిఁగూడి యిట కరుదెంచుచున్నటుల నున్నది. (తారాంగదులు ప్రవేశించి వాలిమీఁదఁబడి)

తార:—హా! జగదేక శౌర్యధుర్యా! మత్ప్రేమైక పాత్రా! పాకశాసనపుత్రా! శ్రీరామచంద్రుని దారుణబాణ హతుండవై ప్రాణములఁబాయనుంటివే! ప్రాణపదముగ నీవు పరిరక్షించిన సుకుమారుఁడగు నీ యంగదునివీడ నేగతిని సాహసించితివి? శూరకులాగ్రణీ! క్షత్రియులకు న్యాయా న్యాయములు శూన్యములను టెఱుఁగనైతిని. మృదుతల్ప ములఁబరుండు నీ వికటికరాళ్లఁబడియుండఁజూచి నే నేగతి తాళుదాన? తమ్మునిఁ బురివెడలనడచి, వానిపతిని బలవంత ముగనేలిన పాపఫలం బీగతిఁజేసెనుగాఁబోలు!

మ. తగునా, యీగతి నిన్నుఁజంపనని సీతానాథుఁ డెంతేనియుఁ?
వగనేరీతినిఁబాయ నేర్తునిఁక? నేవత్తుఁ నినుఁగూడి, నా
కగునా, నాథునిఁబాసి యుండఁబుడమిఁ? అన్యాయమంచుఁగదుఁ
జగతీనాయకులెల్లఁ దిట్టరొకో? యీచండాంశువంశోద్భవుఁ.

(అని రామచంద్రునివైపుదిరిగి) రామచంద్రా! నా పతిఁజంపి న్ననాథనుజేసితివి. నీ కిదితగునా? గుణోత్తరుఁడగు నీ యంగదునిఁగాంచియైనఁ గనికరమువహింపకపోతివా? పతిని విడనాడి నే నేగతి బ్రతుకఁజాలుదును? సతీవియోగానల మునఁబడి పరితపించు నీవేల యీధర్మము నెఱుఁగఁజాల వైతివి?

రాము:—అమ్మా! చేసినపాపం బూరకపోదు. చేఁజేత ననుభవింపవలయు. విధికృతమును దప్పింప నేరికిని సాధ్యంబు గాదు. నీటిబుగ్గకు సమానంబగు నీపతిదేహమునకై యేల వగచెదవు?

అంగ:—తల్లీ! చిన్ననాఁటినుండియు క్షణకాలమైనను నన్నువీడక, ప్రేమాతిశయంబునఁ బెంచిన మదీయజనకుఁడు, పరంధాముఁడగు రామచంద్రుని బాణాహతిఁజచ్చి, స్వర్లోక మున కరుగనున్నాఁడు. నీతికోవిదురాలవగు నీవిటులేల దుర పిల్లెదవు?

వాలి:—ప్రాణసతీ! 'జాతస్యమరణం ధ్రువ'మ్మను నార్యవచనమెఱిఁగి యూఱడిలుము. ధాతృనాజ్ఞమీఱ నేరికిని శక్యంబుగాదు. జీవులీయిల నెల్లకాలము శాశ్వతముగ నుండఁ జాలరను టెఱుంగవా? ఈ ప్రపంచమొక నాటకరంగము. ఇందలి జనంబులే పాత్రధారులు. ఈ లోకారాధ్యుండగు రామచంద్రుఁడే సూత్రధారుఁడు. సుగ్రీవా! (అని తమ్ముని బిలచి) నేనొనరించిన పరిభవమును మదినిడక సుషేణు తనయ యగు నీ తారను గౌరవముతోఁజూడుము. శక్తివంచనలేక రామకార్య మవశ్యమొనరింపుము. మదేకపుత్రుఁడగు నంగ దునకు యౌవరాజ్యపట్టముఁగట్టి, నీ కన్నకొమరునిరీతిగఁ జూడుము. రామా! భక్తజనమందారా! నా పాపములనెల్లఁ బోనడంచి, నాకు స్వర్గసుఖంబొసంగుము. (వాలి మరణించును. సుగ్రీవుఁడు తారాంగదులు హా హా రావములుసేయుదురు.)

హను:—సుగ్రీవా ! వాలి పరంధాముండగు రామభద్రుని శరంబున కాహుతుఁడగుటవలనఁ బుణ్యాత్ముఁడై, స్వర్లోక సౌఖ్యము లనుభవింపనేగెను. మరణించిన యాతనికై మీరెంత విలపించినను బ్రయోజనమావంతయునుండదు. కాన దహనాదిక్రియలకుఁగడంగుట శ్రేయము.

సుగ్రీ:—కుమారా ! అంగదా ! పోయిన జనకునకై విచారింపకుము. అన్నివిధముల నీ జనకునకు మారుగనుండి, నీ కన్ని సౌఖ్యముల నొడఁగూర్చెదను. కాన, తనయా ! యీ పరితాపమునుబాసి, సంతసమొందుము. తారాంగనామణీ ! యింగితజ్ఞురాలవగు నీవీగతి పామరపద్ధతిఁ జింతిలనేల ? గతించిన పూజ్యునకు దహనాది క్రియ లాచరింపఁబోవుదము రమ్ము. (రామునిఁగాంచి) మహాత్మా ! రఘుకులతిలకా ! సెలవొసంగఁ గోరుచున్నాఁడను.

రాము:—సుగ్రీవాంగదులారా ! గతించిన దానికై వగఁగుందకుఁడు. సత్వరముగ మీరేఁగి, పరాక్రమనిధియగు వాలికంత్యక్రియల నాచరింపుఁడు. పోయిరండు. (అందఱు నిష్క్రమింతురు)

# తృతీయాంకము

## తృతీయరంగము

ప్రవేశము:—రామ లక్ష్మణులు.

రాము:—అనుజా! లక్ష్మణా! సీతాసతి నాదండలేని కతమున నీ నాలుగునెలలు శతవర్షములై నా కపరిమితతాప మొనగూర్చెను. భర్తృ సంగతిఁ బాయకుండెడి చక్రవాకి భంగి, సీత నాదండనుండి, విధివశంబున నావెంట దండకాటవి కరుదెంచి, యిట్టి యిక్కట్టులపాలయ్యెఁగదా! భర్తృ హిత తత్పరయగు సీతాసతి నెప్పుడు కాంచువాఁడనో కదా!

లక్ష్మ:—అన్నా! వానరాధిపుఁడగు వాలినిఁజంపి, సుగ్రీవునకు రాజ్యమొసంగితివి గాని, యాతండింతవఱకును సీతాన్వేషణమును దలపెట్టఁడయ్యె. ఇట్టి కృతఘ్నుఁడెందైన నుండునే?

రాము:—లక్ష్మణా! రాజ్యమును బోగొట్టుకొని, దనుజేంద్రుచేఁ బరిభూతుఁడనై, జాయకై తన శరణు సొచ్చితినని సుగ్రీవుఁ డనాదరబుద్ధివహించి యున్నవాఁడు కాఁబోలు! లేకున్న మన కానాఁడొనర్చిన శపథములనెల్ల మఱచి, యీ నాలుగు మాసములు మనసంగతినైనఁ దలపెట్టక, యూరకుండునా? మిగులఁ జిత్రముగనున్నది.

లక్ష్మ:—అన్నా! సుగ్రీవుఁడు మున్నుగ్రజున కాత్మఁ దలంకి, ఋష్యమూకాద్రినుండు తఱినాడినమాటలు రాజ్య సంపదమదంబున నేఁడు మఱచియుండుట చిత్రంబుగాదు. రాజ్య సంపదమదంబును, నిరంతర స్త్రీలోలత్వమును సుగ్రీవు నిట్టి దుర్బుద్ధి పాలొనర్చియుండుననుట నిస్సంశయము.

రాము:—సోదరా! లక్ష్మణా!

చ. కడచనె నిన్నినాళ్లుఁ గను గాంతనుజూడక యుండఁజాల, నా
కడ రవిసూనుఁడా దినము గట్టిగ నాడినమాట వుచ్చి, యీ
వడువున నూరకుండె ఘనపట్టముఁబూనిన యంతలోనె, యా
చెడుగను గీశనాథునికఁ జెచ్చెరఁబట్టుకరమ్ము లక్ష్మణా!

ఆలసింపక నీవేఁగి, పరధ్యానమగ్నుండగు సుగ్రీవుఁడెందుండి నను బట్టితెమ్ము. సత్వరంబునఁ బోయిరమ్ము.

లక్ష్మ:—భాగ్యము. తమయానతి శిరసావహించెదను. (అని నిష్క్రమించును.)

(తెరయెత్తఁగా నుద్యానవనమున సుగ్రీవుఁడును, రుమాతారలు నుందురు.)

సుగ్రీ:—రుమాతారలారా! ఈ యుద్యానవన రామణీయమును దిలకింపుడు.

తరలము:—వనజలోచనలార! యీసుమవాసనల్ మదికెంతయో
కనఁగ మోదముఁగూర్చుచున్నవి, గంధవాహుఁడు మెల్లమె
ల్లన సదా యిటువీవసాగెను లాలితంబుగ నిప్పుడున్
మనమునందలి చింతలన్నియుమా సెనీవనమారయన్.

రుమ:—నాథా! ఆదెసఁ గనుఁగొనుము.

తరలము:- వనజమిత్రునినందనా! మధువాని సంతస మొప్పఁగాఁ
గనుము, తుమ్మెదసంచయంబులు గాన మింపుగఁ జేసెడుఁ
వినుము, కోకిల కూజితంబులు వింపుగూర్పఁగ వీనులఁ
అనయమిచ్చటి వింతలెల్లను గాయిఁగూర్పవె, నెమ్మదిఁ.

సుగ్రీ:—రుమాసతీ! వాలికతమున నేను నీయండ లేకుండుటఁజేసి నీ వెంతగ దురపిల్లుచుంటివోగదా! కష్టములు దొలఁగుటఁజేసి, మరల నిన్నుఁగని సుఖంపఁగంటిని. ఇంక నైనఁ జింతలుడిగి ప్రసన్నచిత్తవు గమ్ము.

రుమ:—నాథా! మిమ్ము విడనాడుటచేఁ గలిగిన కష్టములన్నియు రసికాగ్రగణ్యులరగు మిమ్ముఁ గన్నంతనే తీఱెను. ధన్యురాలనైతిని.

సుగ్రీ:—తారాసతీ! గతించినవాలికై యేల యీగతి నిరంతరచింతానిమగ్నవై నీవయోరూపవిలాసముల వృథ సేయుచుంటివి? అన్నగతించినచో నాతనిసతి తమ్మునిసొత్తగుట మన కులాచారముగదా! ఇంకనైన నన్ను సేవించి, ధన్యురాలవు గమ్ము.

తార:—సుగ్రీవా! నీయన్న గతించినంతనే నేను నీదాననైతిని; అది యటుండనిమ్ము. ఒక్కమాటవినుము. నీకు మఱువరాని సహాయంబొనరించి సింహాసనాసీనుఁ జేసిన రామచంద్రునకు నాఁడొనర్చిన బాసలన్నియుమఱచి, నిరంతర కాంతాలోలుండవై, యీ యుద్యానవనమునం దుండుట

నింద్యముగాదా? ఎంతటి ద్రోహంబాచరించితివి! రామచంద్రుఁ డాగ్రహించునేని వాలివలెనే, నీవును బరలోకమున కరుగ వలసినవాఁడ వగుదువు. ఇఁకనైన సత్వరంబుగ రామచంద్రుఁ జేరి, శరణు వేఁడి, వారి కార్యానుకూల్యమొనర్పఁ దగ్గర పడుము. (తెరలో)

ఓరీ! వానరాధమా! రాజ్యసంపదమదాంధా! సుగ్రీవా! ఎందున్నాఁడవు?

(సుగ్రీవుఁడు వినుట నభినయించును; లక్ష్మణుఁడు ప్రవేశించి)

లక్ష్మ:—ఓరీ!

ఉ. కన్నులకెక్కి నీ పొగరు కాంక్షితరాజ్యము సేతఁబడ్డ, నాఁ
డన్న వచస్సు లేడ? కమలాక్షులతోడి విహారమేడ? నీ
కన్నుల క్రొవ్వు పోనడఁచి, కాలునిప్రోలికిఁ బంపినైతు, నా
యన్నలమిన్న సీతనిఁక నారయ బంటులఁ బంపవైతివేః.

క్రూరా! నీవిట్లు సతీమణులఁగూడి నిరంతరకామ లోలుండవై, యుద్యానవనములఁ దిరుగాడుచుంటివే! శ్రీరామ చంద్రునితో నాడిన బాసలెల్ల మఱచితివికాఁబోలు! నానిశిత బాణంబుల కెరయగువేళనైన నీతప్పిదముల గ్రహింపఁ జాలుదువు.

సుగ్రీ:—(భీతినభినయించుచు) ఆర్యా! నమస్కారము. క్షంతవ్యుఁడ. (తారవైపునకుఁదిరిగి) తారాసతి! నీచెప్పిన

చొప్పునకు సాక్షీభూతముగ రామానుజుఁ డ[illegible] ఆతఁడు, క్రోధపూరితమానసుఁడై నన్ను నిందించుచున్నాఁడు. ముందుగ నేనాతనితో మాటాడఁజాలను. మహాత్ములెప్పుడును గరితలయెడఁ గ్రౌర్యమువహింపరు. కాన, నీవే మును ముందు లక్ష్మణునిఁ బ్రసన్నచిత్తునిఁ గావింపుము.

తార:—(లక్ష్మణునిఁజేరి) మహాత్మా! శాంతహృదయులరగు తామిాగతి కోపము వహింపనేల? తమయాజ్ఞ నెవ్వఁడును దాఁటలేదు గదా?

లక్ష్మ:—సుగ్రీవుఁడు నేఁటికి నాలుగునెలలుగా మాస్థితినివిచారింపక, సీతాన్వేషణమునకుఁ గడంగక, యింటి పట్టుననుండి యనిశము మదిరఁగ్రోలుచు, స్త్రీలోలుండై యుద్యానవనములఁ గాలముఁ బుచ్చుచున్నాఁడు. మా యొనర్చిన యుపకృతినైనఁదలంపక యీగతి నూరకుండు టేనాఁటి ధర్మమందువు? ప్రతిజ్ఞాభంగమొనర్చిన సుగ్రీవుండు దండనార్హుఁడుగాఁడా?

తార:—మహాత్మా! అనుకూలచరిత్రులమగు మాయెడఁ గోపమువహింపక యనుగ్రహముఁ జూపవేఁడెదను. నూఱువేల రాక్షసముఖ్యులఁగూడియుండు రాక్షససార్వభౌము జయింప, సూర్యసూతి, కపిపుంగవులనెల్ల రానాజ్ఞనిడి, యింతవఱకు వానరసైన్యము లరుదేరకుంటఁజేసి, మిా యెడకు రాకున్నవాఁడు. కాని, వేఱొండుగాదు. వానరసైన్యములెల్లను నేఁటి కరుదెంచినవి. నేఁడ వారలనెల్లఁ

దోషాకుని శ్రీరామచంద్రుని చరణరాజీవముల సన్నిధికరుదేర నున్నవాఁడు.

సుగ్రీ:—గీ. తనయుఁడను, దప్పుఁజేసితి, దయనుజూపి,
కోపమునువీడి, లక్ష్మణా! కుజనుఁ డనక
బ్రోవఁవేఁడెద నన్ను సంపూర్ణమతినిఁ;
గంచెయే చేనుమేయంగఁ గలద తెరువు?

మహాత్మా! సేవకునితప్పుల మన్నింపఁగోరెదను. పోయిన కీశరాజ్యము పరంధాముఁడగు రామచంద్రుని యనుగ్రహమున లభించెను. అట్టి మిమ్ముమఱచి విలాసలోలుండనై కాలమును వృథసేయునంతటి కృతఘ్నుండఁగాను. వానరసైన్యములు సేరకుండుటయే నాయాలస్యమునకుఁ గారణంబు. సర్వసైన్యము లీనాఁ డరుదెంచినవి. రేపటినుండియే సీతాన్వేషణమునకుఁ బ్రయత్నింప నుంటిని.

లక్ష్మ:—సుగ్రీవా! మిగుల మేలయ్యె. సీతామహాజననికై రామచంద్రుఁ డాతురపడుచున్నాఁడు. తరుణీ వియోగ జనితవ్యథం గుందెడు రాముఁదేర్చుట మనవిధిగదా! మిత్రమా! నిన్ను దూఱితినని కినియకుము. ఇంక నేఁబోయి వచ్చెదను. త్వరితగతి రామచంద్రునిఁ జేరరమ్ము.

సుగ్రీ:—లక్ష్మణా! అవశ్యమటులనే యొనర్చెదను. రామచంద్రునకీ యుదంతంబెఱింగించి, శాంతచిత్తుఁజేయుము.

లక్ష్మ:—సుగ్రీవా! పోయివచ్చెదను. (నిష్క్రమించును.)

సుగ్రీ:—రుమాతారలారా! మనమును వెడలుదము రండు. (నిష్క్రమింతురు.) (అవనిక పడును)

శ్రీ

# సీతాన్వేషణము

## చతుర్థాంకము

### ప్రథమరంగము

స్థలము:—ఋష్యమూకాద్రి.

ప్రవేశము:—రామలక్ష్మణులు.

రాము:—లక్ష్మణా! సుగ్రీవుఁ డరుదేరనున్నాఁడని చెప్పితివిగాని, యింతవఱకును రాఁడయ్యె. హేతువేమయి యుండునో తెలియకున్నది. సోదరా! ఏనాఁడు సీతాసతి నెడఁ బాసితినో యానాఁటినుంటియు నా భోగములన్నియు నశించినవి. (స్మృతి నభినయించి) హా! సీతా! సుగుణోపేతా! పాపకర్ముండనై నిన్నుఁ బరులకర్పించి జీవచ్ఛవంబనైతిని. భుజబలసమన్వితులగు రాక్షసుల నెందఱినో రూపుమాపితిని. కాని, నిన్నుఁ గొంపోయిన దుష్టరాక్షసునిఁ జంపకుంటిని. నన్నుఁ దలఁచి దలఁచి యెంత కృశించియుందువో గదా,

గీ. పాపకర్ముండనై నేను బడఁతి, నిన్నుఁ
బరులకర్పించి, చావక బ్రతికియుంటిఁ;

గష్టవారాశి మునుఁగుటకతన, నీవు,
ప్రాణములువాసి యుందువో? పాయఁగలవొ?

ఓరీ! రావణా! కుటిలుండవై, కులకాంతయని యొక్కింతయుఁ దలంపక, సీతాసతినిఁ గొంపోయి, నన్నిట్టి యిక్కట్టుల పా లొనరించిన నిన్ను యమసదనమునకుఁ బంపు టెన్నఁడో గదా!

లక్ష్మ:—కోదండరామా! బాహు విక్రమశాలురగు ప్లవగవరులఁగూర్చు కార్యభారమగ్నుఁడై సుగ్రీవుండింత దనుక మనకడకురాక యుండెను. నేఁటికి వానర సైన్యమంతయు నరుదెంచెను. తమ దర్శనార్థ మావనచరాధినేత ససైన్యుఁడై రానున్నవాఁడు. (దృష్టిసారించి) రామా! అటు సూడుము. కిలకిలారావములఁ జెలంగు కపిసైన్యమును గూడి సుగ్రీవుం డరుదెంచుచున్నాఁడు. మిత్రవత్సలుఁడగు సుగ్రీవుఁడు మన కార్యమును దప్పక సఫల మొనర్చును.

(సుగ్రీవుఁడు సైన్యమును నిలిపి, మంత్రులతోఁ బ్రవేశించును)

సుగ్రీ:—మహాత్మా! శ్రీరామచంద్రా! గగనమణి గోత్రగ్రామణీ!

గీ. భక్తవరులను బ్రోచెడు పరమపురుష!
దశరథేంద్రతనయ! నీవు, ధర్మసరణి
వాలిఁదునుమాడి ప్రోచితివయ్యనన్ను;
వందనశతంబు లివె కొమ్ము, వరగుణాఢ్య!

(నమస్కార మొనరించును)

రాము:—సుగ్రీవా! వాలిని సంహరించి, నిన్నుఁ గిష్కింధాధిపతినిఁ గావించిన నా సహాయమును మఱచి, యింతవఱకును సీతాన్వేషణమునకుఁ గడంగక, రాజ ధర్మముల, విడిచి, నిరంతర కామలోలుఁడవై కాలమును వృథ సేయఁజనునా ?

సుగ్రీ:—జగదభిరామా! శ్రీరామా!

చం. ఘనతరకష్టవార్ధిఁబడి కాయముఁబాయఁగ నున్న వేళ, నీ
ఘనతరమైత్రిఁ జూపి ననుఁగావఁగ వాలినిఁజంపితయ్య నే
ననయము నిన్నుఁగొల్చుచును నాదగు కాలముఁబుచ్చునుండఁగా
వినయముఁజూపి, యీగతిని వీడితినం చెదనెంచఁజెల్లునే ?

నిరంతరము నీచరణసేవయే ప్రాణపదంబుగఁ దలచుచుఁ గాలము గడపనుండు నన్నన్యవిధంబునఁదలంచి యిటులాడఁ జనునే? పరంధాముఁడవగు నిన్ను మఱచి సంసారాంధ కూపంబునఁ బడియుందునని తలంచితివా? రామా! వానర సైన్యములఁ బ్రోఁగుసేయుటయే నా యాలస్యమునకుఁ గారణంబు.

రాము:—సుగ్రీవా! కాలమెంత త్వరితగతి నరుగు చుండినదియు నెఱుంగకుంటివి. పదునాలుగువత్సరము లీ యరణ్యావాసము సీతావియోగ దుఃఖమునఁబడి కృశించుటకే ప్రాప్తించెను గాఁబోలు. లక్ష్మణుఁడు వచ్చునందాఁక యీవిష యమునే పెడచెవినిఁబెట్టి యుంటివనితోఁచెడిని. గతించిన దానికై చింతిలనేల? ఇప్పుడైనఁ గార్యమునకుఁ గడంగ

నెంచితివే? కాలయాపనంబు చేసి, నామనమున కారాటంబేల కలిగించెదవు ?

గీ. ఎల్లదిక్కులం గాలించి, యిలతనూజ
జాడవారసి కిష్కింధ జాడవట్టి
వచ్చునంతటి ఘనులగు వనచరులను
భాస్కరాత్మజ! యింక నైనఁ బంపవలయు.

ఇంకనైనను, సీతాన్వేషణార్థమై శక్తిసామర్థ్యంబుల నలరారు వానర ముఖ్యుల నల్దెసలకుఁ బంపవలయు.

సుగ్రీ:—మహాత్మా! కామరూపధరులును, కాంతార మార్గ విజ్ఞానులునగు ప్లవగ గోలాంగూల భల్లుకముల మూఁడు భాగములుగ విభజించి, యొక భాగమును వినతుని యాధిపత్యమునఁ దూర్పుదిక్కునకును, మఱియొక భాగమును సుషేణు నాధిపత్యమునఁ బశ్చిమదిశకును, వేఱొక భాగమును శతవలి యాధిపత్యమున నుత్తరమునకును బంపియున్నాను. హనుమంతుని, నంగదజాంబవంతునల నీలుఁగూడి యామ్యదిక్కున కరుగ నియమించియున్నాను. అతఁడు ప్రయాణ సన్నాహుండై యింతలోన రాఁగలఁడు. (తెరలో) దయామయా! జానకీరమణా! చండకిరణకులమండనా!

గీ. మీకృపాదృష్టియను గాలి సోఁకఁజేసి,
మునులతపములు నిర్విఘ్నముగఁ జెలంగ
రక్కసులనెల్లఁ జంపవే, రామచంద్ర!
నీదుమహిమను బొగడంగ నాదుతరమె.

సుగ్రీ:—కోసలరాజ కన్యకాగర్భ శుక్తిముక్తాఫలా! జగదభిరామా! మారుతాత్మజుఁ డరుదెంచుచుండినటు లున్నది. (ప్రవేశము:—హనుమంతుఁడు)

హను:—గీ. శ్రీపయోబ్ధినికేతన! శేషశయన!
శాశ్వతశరణ్య! యోగీశ! చక్రపాణి!
ప్రణుతలక్ష్మీ కుచాంబుజరాజహంస!
శరణు, శ్రీరామ! రఘురామ! శరణు, శరణు.

(అని సాష్టాంగనమస్కారమొనరించును.)

రాము:—మారుతీ! చిరంజీవివై వర్ధిల్లుము. అంజనాసుతా! ప్రాణేశ్వరి వియోగముకతమున సంతససౌఖ్యములు రెండును గడుదూరమయ్యెను. ఈ పరితాపాగ్నిఁబడి, నే జీవములఁ బాయుట నిక్కవము.

ఉ. ఎచ్చటనున్నదో? మఱియు నేగతిఁ జింతనుగుందుచున్నదో?
యిచ్చఁదలంచి నన్మదిని, నేగతిఁజావఁగ సిద్ధమయ్యెనో?
మచ్చునకైన లేరుభువి మాపక్రోశయముఁగోరువారు, నీ
వెచ్చటనుండినన్ సతిని నేర్పడఁగన్గొనిరమ్ము, మారుతీ!

జాగరూకత వెదకి, సీతజాడలరసి, త్వరితముగఁ జనుదెంచి, నను సంతసమొందఁ జేయుము.

హను:—(చేతులుజోడించి), ధరాకుమారీమ్మణీరమణీయమనఃకమలకమలాకరవిరాజమానహంసోత్తంసవిహారా! శ్రీరామచంద్రా! అదృష్టవశమున జానకీమహాజననిఁ గాంతు

నేని నేనెవ్విధి రామదూతనని యామెకు నమ్మికవుట్టఁజేయు దును ?

రాము:—కపిశ్రేష్ఠా ! కాంచనమయంబై నాపేరుగల యీయుంగరమును గొనిచని, సీతాసతికిఁజూపిన, నాదుదూత వని నిన్ను నిర్భీతిగనమ్మఁగలదు. కాన, నీ పైఁడియుంగరమును గొనిచనుము. (అంగుళీయక మొసంగును.)

హను:—మహాప్రసాదము. (అంగుళీయకమునుగొని కన్నులకద్దికొని)

గీ. అలఘుశ్రీరామచంద్రుని యాజ్ఞగొనుచుఁ
బోవుచుంటిని నిప్పు డపారలంఘి వెదుక,
సర్వ గంధర్వ రాక్షస సర్వలోక
ములనుగాలించి వేగమముగుదఁగాంతు.

(అని రామచంద్రునకు నమస్కరించును.)

రాము:—సమీరనందనా ! పోయిరమ్ము. నెలదినముల గడవునుమాత్రము మఱువకుండుము. నీ యాగమనమునకై నిరీక్షించుచుండువాఁడను. శీఘ్రముగఁబోయి శుభంబుగ నరు దెమ్ము. (రామనామస్మరణ మొనరించుచు, హనుమంతుఁడు, నిష్క్రమించును.)

# చతుర్థాంకము

## ద్వితీయరంగము

స్థలము:-వింధ్యపర్వతము.

ప్రవేశము:-అంగద హనుమదాదివానరవీరులు.

అంగ:— కేసరీసుతా! దుర్గమారణ్యములును, ఘోర దరీగిరీంద్రములను వెదకితిమి, సీతజాడలుగాని, సురకంటకుఁడగు దశకంఠునిజాడలుగాని, కానఁబడవయ్యె. ఊరక మరలుదుమేని మహోగ్రశాసనుండగు నినజుండేగతి మనల దండించునో యెఱుంగము.

హను:—యువరాజా! నిద్రాహారముల నెఱుంగక యింతవఱకు వెదకితిమిగాని, మాతామతల్లియగు సీతను గాంచఁజాలకపోయితిమి. తిరుగ నేమోముతో రామచంద్రునిఁ జూడఁగలము?

జాంబవంతుఁడు:— మిత్రులారా! ఇటుసూడుఁడు. ఈ తరుసమీపమునందొక గుహ యగుపడుచున్నది. ఆ గుహను జొచ్చి, యందెందైన సీతామతల్లి యుండునేమో కనుఁగొందము రండు. (హనుమదాదులు గుహనుజొత్తురు.)

హను:—అంగదాది మహాయోధవరేణ్యులారా! ఈ గుహయెంత రమణీయముగనున్నది. మధురరస ఫలభరితం

బులో లతాతతులుగన నేత్రపర్వమొనర్చుచున్నవి. మిక్కుటముగ క్షుత్పిపాస లుదయించుటఁజేసి, ప్రాణవాయువులు వాయునటులున్నవి. ఈ ఫలములఁదిని, యాఁకిలి నడంచుకొందమురండు. (కొన్ని ఫలములఁదిని ముందుకు నడచి) వానరులారా! అల్లదే! కనుంగొనుఁడు. కృష్ణాంబరధారిణియై తపస్వినిఁబోలియున్న యమ్మహాత్మురాలు సాధ్వీమతల్లియగు కోసలాత్మజకూర్మి కోడలని తోఁచుచున్నది. మాయానిర్మితంబగు నీ గుహాంతర్భాగమునఁ బరులకన్నులకు గోచరింపనటుల సతీతిలకమగు జనకజను రావణుఁడు దాఁచియుంచెనా? ఏమో? చేరఁబోయి నిజవృత్తాంతం బరయుదమురండు. (స్వయంప్రభను సమీపించి) తల్లీ! ముత్తియంపు జాలరులతో నొప్పి, యపరంజి గవాక్షములుగలిగి, యగ్నిహోత్రమునకు సమానతేజముగల కాంచనరాసులతో నిండి, చిత్తమిగురింపఁ జేయుచున్న యీసౌధరాజ మెవ్వరిది? నీ వెవ్వరిదానవు? నీ పావననామాక్షరంబులెవ్వి?

స్వయంప్రభ:—వనచరవీరులారా! మీరేగతి యీ గుహానుజొచ్చితిరి? మున్ను మయుండను రాక్షసముఖ్యుఁడు, పద్మగర్భుగూర్చి వేయివత్సరము లుగ్రతపంబొనరించి, వరంబులఁగొని, యీ స్వర్ణగృహమును నిర్మించుకొని, హేమయను నచ్చరమచ్చెకంటినిఁగూడి కాలంబుఁగడుపుచుండ, వేల్పులతేఁడు, సంగ్రామంబున హేమాసక్తుఁడగు మయుని వజ్రధారచే ఖండించెను. నృత్తగీతవిశారదయగు హేమాసతికి మయుండీ హైమగృహమునొసంగెను. నే నా హేమకుఁ గూర్మి

సఖనగుట నీభవనమును గాపాడుచుందును. మేరుసావర్ణికేను వరతనూజను. నా పేరు స్వయంప్రభ. ప్లవగవరులారా! మీ యుదంతంబెఱిఁగించి, నను ధన్యను జేయుఁడు.

హను:—తల్లీ! దశరథక్ష్మాతలేంద్రుని తనయులగు రామలక్ష్మణులు, తండ్రి యాజ్ఞానువర్తులై, విదేహరాజ తనూజఁగూడి దండకాటవినిఁ గ్రుమ్మరుచుండ, రావణుఁడను రాక్షసరాజు, చౌర్యమ్మునఁ బతివ్రతాతిలకంబగు సీతాసతినిఁ గొంపోయెను. రామభద్రుని మిత్రుఁడగు సుగ్రీవుఁడను వానరాధిపతి, సీతాన్వేషణమునకై మమ్ముఁబుత్తెంచ, దక్షిణదిశనంతయు వెదకి, యెందును నా మహాజననిఁగానక, క్షుత్పిపాసాపీడితులమై యీ గుహఁజొచ్చితిమి. వెలికిఁజేరు వెరవుఁగానక చింతిలుచుంటిమి. వృక్షచరాధినేత విధించిన కాలమాసన్నమగుచున్నది. రామకార్యాసక్తులమగు మమ్మీ గుహనుండి బయటికిఁ జేర్చి, పుణ్యముఁగట్టికొమ్ము.

స్వయం:—కపిశ్రేష్ఠులారా! భక్తపరాధీనుఁడగు రామచంద్రునిదూతలరగు మీ రెంతయు ధన్యులరు. అట్టి మీకు నాయోపిన సహాయంబొనరించి, నాజన్మము సార్థకమొనరించుకొందుఁగాక! ప్లవగవరులారా! మీకన్నులను మూసికొనుఁడు. నాతపంబు పెంపున నీమహాబిలంబును దరింపఁజాలుదురు.

(వనచరులు కన్నులుమూయ వింధ్యపర్వతమూలమున నుందురు,)

హను:—జాంబవంతాది మహావీరయోధవరేణ్యులారా! ఎందు వెదకినను మహాజననియగు సీతామతల్లిజాడ

లోకింతయేనిఁ దెలియఁబడకున్నవి. సీతను గనుఁగొనక, భార్యా వియోగపరితప్తుండగు శ్రీరామచంద్రుఁ జేరుటెటులు? రామ నామమునుదలఁచుచుఁ బ్రాణములఁబాయుటయే లెస్సయని తోఁచుచున్నది.

అంగ:—అంజనాసుతా! నీవు వచించెడుమాటలు యథార్థంబులనుట నిస్సంశయంబు. సీతజాడలఁ దెలియక, కిష్కింధకేగుచోఁ గఠినశాసనుండగు సుగ్రీవుఁడు మన ప్రాణములఁ దీయుట నిక్కము. అచ్చో నీచపుఁజావు చచ్చుట కంటె, శ్రీరామనామస్మరణ మొనరించుచుఁ బ్రాయోపవేశ మొనరించుటయే మేలు.

జాంబ:—మారుతాత్మజా! శ్రీరామచంద్రుని చరి తంబు నొకసారి వీనులకఱవుదీఱఁ బూర్తిగ వివరింపుము. అవసానకాలమునందా మహాత్ముని దివ్యచరిత్రమును విని జీవ ములఁ బాయుదము. శ్రీరామచంద్రుని కథాశ్రవణము పాప హరము.

(సంపాతి యొకప్రక్కఁ బడియుండును.)

సంపాతి:—(స్వగ) ఇమ్మనీయులెవ్వరో, సీతారాముల నామములఁబలుకుచు నాకానందముఁ గూర్చుచున్నారు. వీరి నుడులఁబట్టిచూడ, సీతాన్వేషణార్థ మరుదెంచిన పావనచరిత్రు లగు రామదూతలని తోఁచుచున్నది. వీరివృత్తాంతము నర యుదుఁగాక!

అంగ:— కేసరీసుతా! శ్రీరామచంద్రుని చరిత్రగీతములఁ బాడుము; వీనులార విందుము.

హను:— అంగదాది కపినాయకశ్రేష్ఠులారా! పరంధాముఁడగు శ్రీరామచంద్రుని చరితమును దెలిసిపలుక నాబోఁటి యల్పజ్ఞునకు సాధ్యమగునా? నాకుఁ దెలిసినంతవఱకుఁ బలికెద. వినుఁడు.

గీ. ధరణి దశరథుఁడనురాజు ధర్మఫణితిఁ
బుత్రకామేష్టి యొనరింపఁ బుష్పబోఁడి—
కోసలాత్మజ—కౌసల్య కోర్కెదీఱ
జననమొందెను శ్రీరామచంద్రుఁ డుర్వి.

దశరథుఁడను నయోధ్యాధినేత యనపత్యుండై, పుత్రకామేష్టి నొనరింప, భృగుశాపబద్ధుఁడగు శ్రీమన్నారాయణుఁడు కౌసల్యాదేవిగర్భమున రామచంద్రుఁడై జననమందెను. భూభారహరణార్థ మవతరించెనుట కామహనీయుఁడు—

సీ. తాటకఁదునుమాడి, తపసి జన్నముఁగాచి,
హరువిల్లువిఱిచె మున్యాళి మెచ్చ,
రాజలోకము నెల్ల రహిమీరఁద్రుంచిన
పరశురాముని భంగపఱచె మిగుల,
ఖరదూషణాదుల ఖండించి, మునులకు
ముద మొనగూర్చెను భూరిగుణుఁడు,
వాలినిఖండించి, వరమతిసుగ్రీవు
సఖ్యంబుఁజేసెను సదయుఁడగుచు,

గీ. నట్టి శ్రీరామచరితంబు ననవరతము
కీ ర్తనము సేయువారికి నా ర్తులుడుగు,
భోగభాగ్యంబు లమరును! పుణ్యమమరు!
రామనామంబు మించు మంత్రంబుఁ గలదె?

సంపాతి:—(స్వగ) శ్రీరామనామ రసాస్వాదనమునఁ దన్మయత్వము నొందితిని (లేచి- యించుక ముందుకువచ్చి ప్రకాశముగా) మహాత్ములారా! శ్రీరామకథా శ్రవణమూలమున నాశాపము తొలఁగెను. సుఖమొందితి. నన్ను సంపాతి యందురు. జటాయువు నాకు సహోదరుఁడు. సీతాదేవిని, లంకాధినేతయగు రావణుఁడు, చెఱఁగొంపోవుట గన్నులారఁ గాంచియు, నెదిరింపశక్తిలేక యిన్నకుంటిని. దనుజేశ్వరుం డాతరళాయతాక్షిని సముద్రమధ్యంబునం దుండు లంకాపట్టణమునం దుంచియుండును. ముదుసలినగుటచే జవసత్త్వంబు లుడిగి లంకకుఁ బోఁజాలకుంటిని. లేకున్న లంకఁజొచ్చి, దుర్మదాంధుఁడగు రావణునిఁ బొరిగొని, సీతామతల్లినిఁ గొనివచ్చి, శ్రీరామచంద్రునకొసంగి, నాజన్మమును సార్థకముఁ జేసికొని యుందును. కపివరేణ్యులారా! మీకు శుభంబొదవెడుఁగాక! లంక కేఁగి సీతను గనుఁగొనిరండు.

హను:—పక్షీంద్రా! సీతాదేవివృత్తాంతమును దెలిపి, పోనున్నప్రాణముల నిలిపినందుకు మేమెంతయు గృతజ్ఞులము. ఇదె! లంకకుఁ బోయివచ్చెదము.

సంపా:—మంచిది. (అని, నిష్క్రమించును.)

# చతుర్థాంకము

## తృతీయరంగము

స్థలము:—సముద్రప్రాంతభూమి.

ప్రవేశము:—హనుమదాది వానరవీరులు.

అంగదుఁడు:—మిత్రులారా! పక్షీంద్రుఁడు, సీతామహాజనని రావణునిచే నపహృతయయి, లంకయందున్నయది యనువార్తఁ దెలిపెను. కాని, శతయోజనవిస్తీర్ణంబగు నీజలధినిదాఁటి, లంకఁ జేరుటెట్టులో తెలియకున్నది. సీతజాడ తెలిసియు నిష్ప్రయోజనమయ్యెను.

నీలుఁడు:—అంగదరాజేంద్రా! కార్యముపట్ల మన మీఁగతిఁ జింతిలప్రయోజనములేదు. ఇప్పట్టున ధైర్యమే శరణ్యము.

గీ. సప్తవారాసులందును స్నానమాడి,
దినదినంబును హరిని గీర్తించునట్టి
వాలిపట్టివి, నీకెంత వార్థి యనఁగ,
రమ్ము, దాఁటుము వేగ, తారాకుమార!

అల్లునకల్లుండగు నీరత్నగర్భుఁ డించుకయు నక్కటికము లేక, నిజసుతను గొంపోవుచుండ, ననాదరబుద్ధివహించి చూచుచుండ, మనస్సెట్టులొప్పెనోగదా! ఇట్టికఠినాత్ముండెందైన నుండునా! నేనవలీల నఱువదియోజనంబులు దాఁటఁగలుగుదుగాని, శతయోజనంబులు లంఘింపఁజాల. కాన, నో యువ

రాజా! పరాక్రమధుర్యుండవగు నీవేఁగి, సీతామతల్లిజాడలఁ దెలిసిరమ్ము.

అంగ:— మంత్రిసత్తములారా! నే సునాయాసంబుగ నీసముద్రమునుదాఁటి లంకఁ జేరఁగలుగుదును. కాని, తిరుగ నరుదెంచుశక్తి నాకడలేదు. బాలుఁడనగు నాశక్తి మీరెఱుఁగ నిదికాదు. కానిండు. ప్రయత్నమున లంకఁజొచ్చి, సీతామహాజనని జాడలనరసి, రావణు గర్వమడఁచి, వచ్చెదగాఁక!

జాంబ:—కపిశ్రేష్ఠులారా! బాలుఁడయ్యును యువరాజాడు నుత్సాహజనకవాక్యములు ప్రశంసనీయములు. కాని, సేవకులమగు మనమందఱ ముందుండి, యువరాజగు నంగదుని బంపఁజనునా? నే సునాయాసంబుగ నెన్నియోసారులు లంక కేఁగియుంటిని. కాని, ముదుకండనగుటచే నిప్పుడిరువదియోజనములకన్న నెక్కువ లంఘింపఁజాలను. హనుమంతుఁ డాతని శక్తిసామర్థ్యసంపదల నెఱుంగఁజాలక, నివుఱుగప్పిన నిప్పుభాతి నూరక యున్నవాఁడు. ఇతఁడు బాల్యమునందు రవినిఁ గొలిచి విద్యలనభ్యసించిన పరాక్రమోపేతుఁడు. జవసత్త్వ సమన్వితుఁడగు నిమ్మహనీయుఁడే యీవార్థినిదాఁటి, లంకఁ జేరి, కార్యానుకూల్య మొనరింపఁజాలు సమర్థుఁడు. లేకున్న నిందఱము మనముండ, శ్రీరామచంద్రుఁడు తన యంగుళీయకము నేల యీమారుతాత్మజున కొసంగును? ఆంజనేయుఁడు దక్క, నన్యులా లంకఁజొచ్చి, సీతజాడల నరసివత్తురనుట కల్ల. ఇందులకీ పవమానసుతుఁడే నిక్కముగ సమర్థుఁడు. కాన, నోయంగదరాజేంద్రా! మారుతాత్మజునిఁ ప్రార్థించి, సీత

జాడలనరయ లంకకుఁబంపుము. యువరాజా! ఇతఁడు సామాన్య కపివరుండని తలంచితివా? ఇతని జన్మప్రకారం బెఱింగించెద, వినుము. అచ్చరమిన్నయగు పుంజికస్థలయను ఖ్యాతరూప, కిశకాంతయై జనించెను. అమ్మనోహరాంగి యంజన యనఁబరఁగి, కేసరియను కపినాథునకుఁ బత్నియయ్యె. యౌవనవిలాసినియగు నాకపికాంత మనుష్యాకృతివహించి, విచిత్రమనోజ్ఞభూషణములఁగై సేసికొని, శైలతటంబునఁ జరించుచుండ మారశరాహతిఁ జిక్కిన సమీరణుఁడా సాధ్వీమణినిఁగాంచి, పొదివి, కౌఁగిలింప, జవమున, లంఘనంబున వాయువునకెనయగు నీయాంజనేయుఁ డుద్భవించెను. ఇట్టి జవసత్త్వపరాక్రమోపేతునకు శతయోజనములన నెంత! ఇతనికీ యుదధి యొక పిల్లకాలువను బోలును.

అంగ:—మారుతాత్మజా! ఇంకను గాలయాపనమేల? సత్వరంబుగ బయలుదేరి, వనధిదాఁటి, లంకఁజొచ్చి, మాతామ తల్లియగు సీతజాడల నరసిరమ్ము.

హను:—యువరాజా! మీయాజ్ఞాబద్ధుండనై నేనరుగుచుంటిని. శ్రీ జానకీనాథునికరుణచే సర్వార్థసిద్ధినిఁ బడసి వచ్చెద. సెలవొసంగుఁడు. నేనిదే పోయివచ్చెదను.

అందఱు:—హనుమంతా! మతిమంతా! పోయిరమ్ము. నీకు శుభమగుఁగాక!

(రామనామస్మరణఁ జేయుచు హనుమంతుఁడు నిష్క్రమించును.)

శ్రీ

# సీతాన్వేషణము

---

## పంచమాంకము

### ప్రథమరంగము

స్థలము:—లంకాపురము.

ప్రవేశము:—హనుమంతుఁడు.

హనుమంతుఁడు:—బలపరాక్రమ సమన్వితులగు రాక్షసులచే రక్షింపఁబడుచున్న యీ లంకాపట్టణమును, సూక్ష్మరూపమునఁ బ్రవేశించి వెదకితినిగాని, యింతవఱకును సీతామతల్లినిఁ గాంచఁజాలనైతిని. ఔరా! యీలంకాపుర వైభవంబెంతని పొగడుదును! శరత్కాలమేఘతుల్యములగు మేడలతోడను. సుందరమైన పూఁదోఁటలతోడను, జలయంత్రములతోడను, విచిత్రపతాకములతోడను, మహనీయమరకత శోభాభాసురంబై, భోగవతీపట్టణమును మఱపించుచున్నది. ఇట్టివైభవములుగల రావణునకీ దుర్గుణంబు లేకయున్న నెంత శ్లాఘనీయుఁడగునో కదా! అరివర్గమునెల్ల నిర్జించిన యీరావణుఁ డనంగవిజితుఁడై నింద్యుఁడయ్యెను. ఇల్లిల్లునుగాలించి,

తుదకంతఃపురముఁజొచ్చి చూచితిఁగాని, సుకుమారగాత్ర యగు సీతామహాజననిజాడ లెందును గానఁబడవయ్యె.

కటకటా! యింకేమి సేయఁగలవాఁడను. పతివ్రతామణి యగు సీతామహాజనని దుష్టుఁడగు రావణుఁ డాడుపలుకులకు సహింపనోపక, విగతజీవి యయ్యెఁగాఁబోలు! ఎన్నిశ్రమలకోర్చి తుద కిందుఁ జేరినను నాప్రయత్నము విఫలమయ్యె.

ఉ. లంకిణి రూపుమాపి, యిటు లంకనుజొచ్చితిఁ జోరురీతి,ని
శ్శంకత నెందుఁజూచినను శాంతసమన్విత సీతలేదు; నే
బింకముఁజూపి, రావణుని భీకరభంగినిఁ జంపివైచి, యీ
లంకను వార్థిముంచి, ఘనలాఘవ మేర్పడ రాముఁజేరెదన్.

ఇంతకన్నను గర్తవ్యములేదు. సీతజాడ దెలియక రామచంద్రుఁజేరినఁ గాంతానురక్తుఁడగు రాముఁడు జీవములఁ బాయును. వెనువెంటనే లక్ష్మణుఁడును మృతిఁజెందును. ఇదంతయుఁగాంచి, మిత్రవత్సలుఁడగు సుగ్రీవుఁడు ప్రాణములు దొఱఁగును. అంత, యువరాజగు నంగదుఁడును, రుమాతార లును, గపివర్గంబును విగతజీవులగుదురు. ఈయుదంతంబంతయు నెఱింగి, యయోధ్యయందుండు భరతశత్రుఘ్నులును, కౌస ల్యాది యంతఃపురకాంతలును నార్తిఁజిక్కి, యగ్నినుఱుకు దురు. అక్కటా! ఎంతవిపత్తు రానున్నది! తల్లీ! నిన్నుఁగనుఁ గొని, నీక్షేమసమాచార మా రామచంద్రునకెఱింగించి, సంత సింపఁజేసెడు భాగ్యమీ మందభాగ్యునకు లేదుగదా! (అని నలువంకలఁజూచి) అదిగో! యనతిదూరమున నెద్దియో

యుద్యానవనమొండు కానఁబడుచున్నది. అందులఁగూడఁ దిలకించి, పిమ్మట, నేఁ జేయఁదలఁచిన కార్యమునకుఁ గడం గెదఁగాక! (నిష్క్రమించును)

(యవనిక నెత్తగా నశోకవనము.

రాక్షసస్త్రీలు కావలియుండ, సీతయొక వృక్ష చ్ఛాయను గూర్చుండియుండును.)

సీత:—రామచంద్రా! నీముఖారవిందమును గన్నులారఁ గాంచుభాగ్య మీమందభాగ్య కీజన్మమున నింక లేదు కాఁబోలు! మాయామృగంబునుగాంచి, చపలత్వమున దానిఁ బట్టితెచ్చుటకై ప్రాణనాథుండవగు నిన్నుఁబంపి, పావనచరితుఁ డగు లక్ష్మణునిశంకించి, పరిపరివిధముల నిందించితిని. ఆ పాప ఫలం బూరకపోవునా? సోదరతుల్యుఁడగు లక్ష్మణు నన్యవిధం బునఁదలఁచి దూఱిన నాకు నిష్కృతియున్న దే? రామా! నాకింక దిక్కెయ్యది? నా మొఱ నాలకించువా రెవ్వరు?

(ప్రవేశము—హనుమంతుఁడు)

ఈవృక్షచ్ఛాయను గూర్చుండి, శోకదేవతఁబోలి, నయనాంతర్గళిత బాష్పధారాకలిత కపోలయుగళయై యొప్పు నీతరుణీమణియె కాఁబోలు పతివ్రతామతల్లియగు సీతామహా జనని. ఈ తరుశాఖోపవిష్టుండనై, నిజంబెఱిఁగెదఁగాక! (ఒక చెట్టుకొమ్మమీఁదఁ గూర్చుండును.)

ప్రవేశము:— రావణుఁడు

(సీతనుజేరి) కాంతామణీ! రామునిఁదలంచుచుఁ గృశించి నీయెళ్లజవ్వనము నేల వృథచేసికొందువు?

ఉ. ప్రేమతరంగ డోలికలఁ దెంపువహింపఁగ నూఁతువంచునో
కోమలి! నిన్నుఁదెచ్చితిని; కోపము సేయఁగనేల నన్ను? నో
సామజయాన! నాదు సరసన్ వసియించుచు మారుబాధలన్
బ్రామము, కూర్పుసౌఖ్యమును, బల్మరు నీగతి మోడిసేయకే.

అడవులయం దాకలములఁదినుచుఁ, గాలమొక్కరీతి గడుపు నరాధముండగు రాముందలంచి, నన్నీగతి త్రోసి పుచ్చెదేల?

చం. మదనునిచేతిబంతి! కడుమారశరాహతి స్రుక్కియిట్లు, నీ
పదములనంటి మ్రొక్కెడిదు పార్థివశేఖరు, రావణున్ గటా!
మదనుని కేళిఁదేల్చకయ, మన్ననజూఁపక త్రోసిపుచ్చెదే!
సదయతఁ జూతువంచు మది సారసనేత్రరో నిన్నునమ్మఁగన్.

సర్వసౌఖ్యములకు నిలయంబగు నీలంకారాజ్యము నేలు నన్నలంతిగఁ జూడక, చేపట్టుచోఁ, దులలేని సౌఖ్యములఁ బొందఁగలుగుదువు. సునాశీరు సుందరహర్మ్యమును మించు బంగరు మేడయందుండి, దాసదాసీజనంబు లూడిగము సేయ, నాపట్టపుదేవియగు మందోదరి నిన్ను సేవించి, చామరంబు వీచుచుండఁ, గ్రొంగ్రొత్త గులాబిపూసెజ్జల నన్నుఁజేరి, సర్వసౌఖ్యముల ననుభవింప నేలయిచ్చగింపవు? శరద్రాజనిభాస్యా! భావజుఁడేయు ప్రసూనాంబక తీవ్రఘాతంబులఁ దాల్మిదక్కి, ప్రార్థనాపూర్వకముగ నీశరణువేఁడ సాహసించితిని.

ఉ. చక్కెరబొమ్మ! మన్మథు నిశాతశరంబులఁ జిక్కినాఁడ; నన్
జిక్కులఁబెట్టనేల? దయచేసి మొగంబొక యింతయెత్తి నా
దిక్కటుజూడు; దాన భవదీయముఖాంబుజ కాంతికెంతయున్
దక్కువగల్గఁబోదు; విను, తామరసాక్షిరో! నామమాటలన్.

సీత:—(స్వగ) ఈదురాత్ముని దుర్భాష లతిశయించు చున్నవి. కటకటా! నాకెట్టిదుర్దశ సంభవించెను. (ప్రకాశము) ఓరీ! రావణా! బ్రహ్మవంశ జనితుండవయ్యును బతివ్రతలఁబట్టి బాధింపఁబూనితివి. మూర్ఖా! నీశివపూజలెల్ల మంటఁగలిపి, స్త్రీలో లుండ వై, యిట్లునాతోనిక్కి వడి మాటాడఁజనునా? ఎందఱినో దుష్టులను బరిమార్చిన రాఘవుఁడు, నిన్నుమాత్రము విడుచునా? ఎన్నటికిని విడువఁడు.

గీ. అన్యకాంతారతినిఁ గోరునట్టి కుమతి
యిహపరంబుల రెంటను నెక్కరాక,
జగతినాయువు స్వల్పమైఁ జచ్చునంచు
ధర్మశాస్త్రము చాటు విధంబువినవె?

పరాంగన మాతృభూత. ఏల యూరక, రామచంద్రుని బాణాగ్ని కింధనంబవయ్యెదవు?

హను:—(స్వగ) ఈదురాత్ములదుర్భాషలు గర్ణకఠోరములుగ నున్నవి. ఈతరువునుబెకలించి, వీని దశశిరంబుల నేలఁ బడఁగొట్టిన మేలగు. కాని, రామాజ్ఞ లేమింజేసి యూరకుండవలసివచ్చె. (అని పండ్లుకొఱుకుచుండును.)

రావ:—ఓసీ! నాకు నీతులంగఱపుచుంటివా? కానిమ్ము. నీవేమన్నను నోర్చికొందుఁగాని నన్ననుగ్రహింపకున్నఁ దాళఁ

జాల. నీయధరామృతపాన భాగ్యంబొసంగి, నన్ను ధన్యునిc జేయుము.

గీ. ప్రాణదానంబుకంటెను బడcతి, చూడ,
నెక్కుడౌ ధర్మమున్నదె యెందుcగాని,
నీవు దయcజూడకుండిన నిలువcజాల
సత్యమిద్యది, నమ్మవె సారసాక్షి!

శతయోజన విస్తీర్ణంబగు నీజలధినిదాcటి, రాముం డిట కరుదెంచుట కల్ల. నీదుకూర్తుల నెల్లc గట్టిపెట్టి, నాసరసc జేరి, సర్వసౌఖ్యముల ననుభవింపుము.

గీ. విమల సౌందర్యరాశివౌ వెలcది, నీదు
కరుణగలిగిన సుకృతంపు ఖనిని నగుదు,
యామినీకాంతుc డుదయింప మోమునెత్తి
రమణనొప్పారు నాచకోరంబు భాతి.

(స్వగ) నలకూబరుని శాపమునకు వెఱచి, దీనిని బలవంతముగcగూడక, యూరకుంటిని. లేకున్న నింతకుమున్నె యీ తరుణీమణినిcగలిసి, దీని యెలజవ్వనమును జుఱ్ఱు లాడి యుందును.

సీత:—కామాంధా! యూరక, పదినోరులున్నవని ప్రేలకుము. నిమిషమాత్రమున నిన్ను శాపదగ్ధుcజేయ నోపుదుc గాని, శ్రీరామచంద్రుcడె యరుదెంచి, నిన్ను సంహరించునని యూరక యున్నదానను.

హను:—మాతా! సత్యము వచించితివి.

రావ:—సీతా! నీవెంతదూషించినను, నీయందలి ప్రేమాతిరేకంబున నాదూషణలు భూషణములగుచున్నవి. ఎన్నఁడో గతించినరాముని దలంపనేల? మఱచిపొమ్ము.

మత్తకోకిల. మానవాధము రాము నేటికి మాటిమాటికి నెంచెదే?
కాన నాతఁడనారతంబును గాంతనిన్ దలపోయుచున్
చాన! యేగను కాలునింటికి, సత్యమీయది, యెన్నఁడో,
కాన, నీగతి శోకమందక, కాంత, కౌఁగిలి యీఁగదే!

సీత:—రాక్షసాధమా! వినాశకాలం బాసన్నంబై యుండ నిట్టి దుర్బుద్ధులే పుట్టుచుండును.

మత్తకోకిల. గోలనాదని యిట్టినీచపుఁ గోర్కెలేటికి బాలికా!
కాలకంఠుని విల్లుఁద్రుంచియుఁ గాలచక్రముఁ ద్రిప్పఁగన్
జాలు నాపతి, రాముఁడాగతిఁ జావఁ జేర్చునె? రావణా!
యేలనన్నిటు మోసగింపఁగ నిన్నిరీతులఁ బల్కెటల్?

అవతారపురుషుండగు రాముండేమి? అంతె మొండు లేమి? ఏలయీ పిచ్చిభ్రాంతి. నిన్నుఁ బరిమార్పనవతరించిన నారాయణుఁడేలొకో రాక, తడయుచున్నాఁడు. ఇంకనైన, నీకామోద్రేకజనితాంధ్యమును నాహితబోధాంజనమునఁ బాపికొని, నన్నా శ్రీరామచంద్రునిఁజేర్చి, శరణువేఁడి. చిరతర సౌఖ్యములనంది, యశఃకాముండవై మనుము.

మ. వినుమా! తెల్వినిఁబొందుమా! తడసినన్ బెంపెల్లఁబోవున్ సుమా!
మనుజాధీశుఁడు, రాఘవుండు, కుమతీ! మన్నింపఁ జాలండిఁకన్
అనుమానింపకుమా! మనోజనిశితాస్త్రాళిచే వ్యర్థన్ గూర్చు, వే
కనుమా! మానితనీతివర్తనమునన్ గామ్యార్థముల్, రావణా!

రావ:—పలుగాకినీ! సామమున నీవు చక్కఁబడు నటుల లేదు. నిన్నీక్షణముననే వధించి, యీరాక్షసాంగనల కాహారమొనర్చెదఁగాక. (ఖడ్గమునుగొని వధింపఁబోయి. వెనుకకుఁదగ్గి) సీతా! నీకు రెండుమాసములు గడువొసంగితిని. దీర్ఘముగ నాలోచించి నాఁటికి సిద్ధపడియుండుము. నాఁడొడంబడకుండుచో నెవ్వరడ్డపడినను విడుచువాఁడఁగాను. రాక్షసాంగనలారా! మీరు దీనికి బుద్ధిసెప్పి, నాయందనురక్తఁ జేయుడు. (నిష్క్రమించును.)

హను:—దురాత్ముఁడగు రావణుఁడు చనెను. సింహముచెంతనుండు లేడిఁబోలి, యింతవఱకును సీతాదేవి రావణునిచెంత మెలంగెను. ఈరాక్షసస్త్రీలు నిదురించువఱకుండి, పిదప, సీతాదేవికడకుఁ బోయెదఁగాక!

(రాక్షసస్త్రీలు నిదురింతురు.)

సీత:—రామా! నాయంధకారబంధుర జీవన పూర్ణామృతకరా! ఇంక నేనీ దురాత్మునిదుండగములకోర్చి యుండఁజాలను. ఇచ్చటనే యసువులఁ బాసెదఁగాక! (చీరచెఱఁగున నురిపెట్టుకొనఁ బోవును.)

హను:—ఇంకఁదడసినఁ బ్రమాదము వాటిల్లును. ఈ సాధ్విని సమీపించుట కిదియ యదను. (అని వృక్షమూలము నుండి దిగి, సీతాదేవిని సమీపించి) జననీ! సీతాదేవీ! ఈ దుష్ప్రయత్నమునుండి విముఖవుగమ్ము.

సీత:—(స్వగతము) వీఁడెవ్వఁడో రక్కసుఁడు. వానర రూపమునఁ జనుదెంచి, నాప్రయత్నము నెల్ల వమ్మొనరింప నున్నాఁడు. (ప్రకాశము) హా! నాథా! రామచంద్రా! ఈ రాక్షసమాయలదాఁటి, నేనేగతి బయల్వడుదాన.

హను:—తల్లీ! జానకీదేవీ! నేరక్కసుఁడఁగాను. నీజాడ లరయ శ్రీరామచంద్రునివలన ననుజ్ఞాతుఁడనై వచ్చిన వాయుసూనుఁడను. హనుమంతుఁ డనువాఁడను.

సీత:—ఏమీ! నిక్కువముగ నీవు శ్రీరామదూతవా! అటులయిన మన్మనోనాథుని యాకారలక్షణాదులఁ దెలుపుము? అంత, నిన్ను నమ్మెదను. లేకున్న నమ్మఁజాల.

హను:—మాతా! సంశయించెద వేల? శ్రీరామచంద్రుని లక్షణములను దెలిపెద. వినుము.

సీ. నీలమేఘచ్ఛాయ నెఱిమించుదేహంబు,
నిండుచందురుమించి నెగడుమోము,
ఆజానుబాహువు, లమిత తేజంబును,
బీనవక్షంబును వెలయుచుండుఁ,
దామర రేకులఁ దర్శింపఁగాఁ జాలి,
కళకళలాడెడి కన్నుదోయి,
సకలావయవముల జలజరేఖలు గలుగు,
రవిసహస్రముల పరాక్రమంబు,
గీ. గలదు శ్రీరామమూర్తికిఁ, గలఁడు లక్ష్మ
ణుండను ననుజుండు విభునిదండ, నేను
వారిపదములఁ గొల్చెడి బంటునమ్మ!
అవనినెల్లరు హనుమంతుఁ డండ్రుననున్.

జననీ! సంశయింపకుము. శ్రీరాముఁడంప నేనిటకు వచ్చితిని. నమ్మకున్న ముద్రికనైనఁ జూడుము.

(అని యుంగర మొసంగును.)

సీత:—(ఉంగరమునుగొని, కన్నులకద్దికొని) ప్రాణనాథుకరాంగుళిని వెలయు నోయుంగరమా! నిన్నుఁ గాంచుటచే నేనెంతయు ధన్యురాలనైతిని.

ఉ. ఎన్నిదినంబులయ్యె నిను నేర్పడఁజూచియు నుంగరంబ, నా
కన్నులఁగాంచఁగల్గితిని కాయముఁ బాయఁగనున్న వేళ, నా
పన్నను, నన్నుఁ బ్రోవఁగను పావనరామునిఁ దోడితేక, నీ
వన్నరనాథువీడి, యిటులక్కట! వచ్చితె నన్నుఁజూడఁగన్.

హనుమంతా! ప్రాణనాథుని క్షేమముఁ దెలిపి, పోనున్న నాజీవములనిలిపి, పుణ్యముఁ గట్టికొంటివి. మఱఁడియగు లక్ష్మణుఁడు, తన్ను శంకించిదూషించినందులకు నన్ను నిందించఁడుగదా! నన్నరయుటకా రామలక్ష్మణులు ప్రయత్నించుచున్నారా?

మ. అకటా! యీగతి నాకుఁగల్గెనని వారాయాసముల్ జెందఁబో
రుకదా? యెప్పటియట్ల హాయిగను వారున్నారె? జీవింపనే
టికిఁ? బ్రాణంబులపైఁ గడుల్ విసువుపుట్టెన్ గిశ! సర్వాంగర
క్షకుఁడై, కేలుమొగుడ్చి, ప్రాణవిభుపజ్జన్ లక్ష్మణుండుండునే?

హను:—మాతా! జనకరాజపుత్రీ! రామలక్ష్మణులు నిన్ను వీడినదిమొదలు నిద్రాహారములనుమాని, దండకాటవినిఁ జరించుచు, వానరాధిపతియగు సుగ్రీవుని చెలిమియొనర్చి

ఋష్యమూకపర్వతమునం దున్నవారు. కొలఁదికాలముననే, కపిసైన్యమునుగూడి యిచ్చటికరుదెంచి, పుత్రమిత్రబాంధవుల తోడ రావణునిఁజంపి, నిన్నుఁ గొనిపోఁగలరు. అంతేల? సెలవగుచో నిన్నా రామచంద్రునికడ నిమిషమాత్రంబునఁ జేర్పఁగలను.

సీత:—హనుమంతా! స్వల్పశరీరుఁడవగు నీవేగతి నన్నుఁ గొంపోవఁగలవు. నీమాటలఁజూడ నాకు నవ్వు పుట్టుచున్నది.

హను:—మాతా! నీసంశయము వాయ నావిశ్వరూపమునైనఁ జూడుము. (అని విశ్వరూపమును జూపును.)

సీత:—రామభక్తాగ్రేసరా! నీశక్తిసామర్థ్యము లసాధారణములు. ఇంక నీవిశ్వరూపమును జాలింపుము. పరపురుషుని స్పృశింపనొల్ల. పుత్రసమానుండవగు నిన్ను సంశయించి పలుకుచున్నానని తలంపకుము. క్రూరకర్ముఁడగు రావణుఁడు నా కొసంగిన రెండుమాసముల గడువును దెలిపి, కపిసేనతో లంకఁ జేరి, రావణునిసంహరించి నన్ను రక్షింపుమని చెప్పుము. ఆంజనేయా! సర్వోత్తమమైన యీమణిశ్రేష్ఠమును గొంపోయి శ్రీరామచంద్రునకొసంగి, త్వరితముగఁజనుదెంచి నన్ను రక్షింపఁ బ్రాణనాథుని పాదపద్మములకు మ్రొక్కి వేఁడితినని విన్నవింపుము. లక్ష్మణునితో నాతప్పులనెల్ల సైరించి, నన్ని చెఱనుండి విడిపింప మఱిమఱిఁ బ్రార్థించితినని తెలుపుము.

హను:—జననీ! అవశ్యమటులనే తెలిపెదను. ఒక్కటి యనుగ్రహింపవలయు. బహుదూర గమనాయాసమున బడలి

యున్నవాఁడ. జవసత్వంబులుగలుగ వనంబునఁగల ఫలంబులఁ దిన సెలవొసంగుము.

సీత:—మారుతాత్మజా! నిన్నెఱుంగుదో, రక్కసుల వలన నీకుఁ బెక్కుకష్టములొదవును. జాగరూకతగలిగి, ఫలములఁగొని చనుము.

హను:—భాగ్యము. (అని నిష్క్రమించి) (తెర ముందర) నేచేయవలసినకార్య మించుకమిగిలియున్నది. రామదూత శక్తిసామర్థ్యము నించుక రావణునకుఁ జవిచూపి, శ్రీరామచంద్రునిఁ జేరెదఁగాక! (నిష్క్రమించును.)

# పంచమాంకము

## ద్వితీయరంగము

రావణునిదర్బారు:—ప్రవేశము: రావణుఁడు, విభీషణుఁడు, ఇంద్రజిత్తు, ప్రహస్తాదిమంత్రులుఁ గూరుచుండియుండ బ్రహ్మాస్త్రబద్ధుండగు హనుమంతునిఁ గొనివత్తురు.

రావ:—(స్వగ) బ్రహ్మాస్త్రబద్ధుఁడగు నీవానరుఁ గాంచఁ బూర్వము నేను, కైలాసపర్వతమును గదలింపనరిగి నప్పుడు నందికేశ్వరుఁడొసంగిన శాపము జ్ఞాపకమునకు వచ్చు చున్నది. బుద్ధిలేని నందిశాపమునకా నేను బెదరవలయు! (ప్రకాశము) తనయా! మేఘనాథా! నీవుగదా నామదికెక్కిన వాఁడవు. లంకఁజొచ్చి, ప్రియతమంబగు నశోకవనమును బాడొనరించుటయెగాక, సుకుమారుండై ముక్కుపచ్చలారని యక్షయకుమారునిఁ జంపిన యీవానరాధముని బ్రహ్మాస్త్ర బద్ధుఁజేసి, కొనితెచ్చితివి. నీయట్టి భుజబలసమన్వితులగు కొమరులుండ నాకేమికొదువ?

ఇంద్ర:—జనకా! ఈవానరుఁడు సామాన్యుఁడుగాఁడు. 'పిట్టకొంచెము కూఁత ఘన'మన్నట్లు, ఈచెనఁటికోఁతి యొన రించిన చెయిదములెన్నియేనిఁ గలవు. ఆజ్ఞలేనిదే లంకాపుర మును జోరునిరీతిఁ జొచ్చుటయొకటి. లంకిణినిఁ గూల్చుట రెండు. అశోకవనమును బాడొనరించుట మూఁడు. జంబు మాలినిఁజంపుట నాలుగు. మంత్రిపుత్రుల నేడ్వురఁ జంపుట

యయెను. మదీయసోదరుఁడగు నక్షయునిఁజంపుట యేలఱ.
ఇట్టివాని నూరకవదలరాదు. వీనివృత్తాంతమును దెలిసికొని
దండించుట కర్తవ్యము.

రావ:—ప్రహస్తా! యీదురాత్ముండు కుబేర యమ
వరుణేంద్రులం దేరికైన దూతయై యరుదెంచి యుండెనేమో
కనుఁగొనుము.

ప్రహస్తుఁడు:—ఓరీ వానరాధమా! నాపుత్రుల
నేడ్వురఁజంపి, నాకపరిమితతాపముఁ గలిగించుటయెగాక,
సుకుమారుఁడగు నక్షయునిఁగూడ నీపొట్టఁ బెట్టికొంటివి. ఇట్టి
కార్యము లొనరించిన నీవెవండవో యెఱింగింపుము.

హను:—ఓరీ! రావణా! నీమంత్రియగు ప్రహస్తుఁడా
నాయుదంతం బెఱుంగువాఁడు. నేనెవండనో తెలిపెద వినుము.

ఉ. వాలము చేతనిన్ను మునువారిధులందున ముంచినట్టి య
వ్వాలిని నొక్కకోలఁగొని ప్రాణములన్ బొరిగొన్నయట్టి యా
కాలునిఁబోలు రాఘవునికాంతను, సీతనుఁ జూచిపోవనీ
ప్రోలికివచ్చినాఁడనిదె పూనికతోడుత, రామదూతనై.

పొందనశక్యంబగు నీదర్శనమునుబొందఁగోరి, నీయశోక
వనమును బాడొనరించితిని. నీచేఁ బంపఁబడిన బలవంతులగు
రక్కసులనెల్ల నాప్రాణమును గాపాడుకొన మడియించితిని.
మున్ను బ్రహ్మ నాకొసంగినవరంబునకు బద్ధుండనగుటవలనను,
నిన్నుఁ జూచుతలంపు గలుగుటఁజేసియు నిచ్చటి కరుదెంచి
తిని. రావణా! యిప్పుడైన నాపలుకులనాలకించి, పతివ్రతామ

తల్లియగు సీతనుగొంపోయి, రామచంద్రునకొసంగి, శరణు వేఁడుము. శరణాగతత్రాణ బిరుదాంకితుఁడగు రాఘవుఁడు, నీతప్పులనెల్లఁగాచి, రక్షించును. లేకున్న, నీప్రాణములు దక్కవని యెఱుంగుము. మూఢచిత్తుండవై, యకారణముగ నేల జీవములఁ గోలుపోయెదవు?

గీ. రాజకులభూషణుండగు రాముతోడ
దనుజకులనాథ! వైరంబు దగదు, తగదు;
రాముఁ జెనకియు బ్రతుకదే రాక్షసేంద్ర!
కోరి కొఱవితోఁ దలగోఁకి కొనెదవేల?

రావ:—ఓరీ! వానరాధమా! నోరున్నదని యూరక ప్రేలకుము హీనుండగు నొకమానవాధముని నాముందర నేల యిట్లు ప్రశంసించెదవు? ఇంద్రునంతటివానిని ముప్పుతిప్పలువెట్టి, యింటితోడఁ గాననములకుఁ బంపితిని. మానవుండనఁగ నెంత?

చం. మదమునఁ గన్నుఁగానకిటు మాటలనాడఁగఁ జెల్లునేర? నీ
మది నొకమారు నెంచితివె, మందుఁడ, నాదగు శక్తిసందడిన్?
వదరకుమింక నోటికినివచ్చినయట్టుల, నీచుఁడా! యిసీ!
బెదరునె రావణుండు? విను, బెబ్బులిజంకునె మేఁకపిల్లకున్?

గీ. పగఱగెలిచినచో నాకుఁ బడఁతిదక్కు;
శాత్రవులె గెల్తురేని నాశలనువీడి,
స్వర్గముంజేరి, సుఖములఁ బడయువాఁడ;
వెడఁగుమాటలు చాలించి వెడలిపొమ్ము.

హను:—బ్రహ్మవరగర్వాంధా! రాక్షసాధమా! నా హితోక్తులు నీకు రుచింపవనుట యే నెఱుంగుదును. పైత్య రోగికిఁ బంచదార రుచించునా? దేవదానవ యక్షపన్నగ గంధర్వసిద్ధసాధ్యులచేఁ జావు లేకుండ వరంబులఁగొంటినని విఱ్ఱవీఁగుచుంటివి. కాని, రాముఁడు వీరిలో నెవ్వండునుగాఁడనుట మాత్ర మెఱుంగవైతివి. వైకుంఠనిలయుండగు నారాయణుండు నీమొంటిగిములఁ దుదముట్టింప నీవరంబున లేని మానవావతారమెత్తెను. చావ సిద్ధముగనున్న నీకు నాయుపదేశములు రుచించునా? పంకజగంధంబు పుష్పంధయంబునకుఁ గాక, భేకంబునకుఁ దెలియంగరాని యట్లు, శ్రీరామచంద్రుని పరాక్రమం బీవెఱుంగఁ జాలకుంటివి.

చం. అనుపమ శౌర్యసంపద సహాయుఁడునై తగు రామచంద్రుతో
దనుజకులోత్తమా! రణముతప్పదు నీకిఁక, మృత్యుదేవతన్
మునుకొని యేలఁగోరెదవు? మూర్ఖుఁడ! నీతినిఁ ద్రోసిపుచ్చకే
మనుమిఁక బుద్ధికల్గియును, మానినిసీతను రాముఁజేర్చియున్.

గీ. చండమార్తాండురీతిఁ బ్రచండుఁడగుచు
వాఁడికోలలు రాముండు వదలునపుడు
నాదుహితబోధ నీమది నాటుఁగాక!
యిప్పుడేటికి నాటునో హీనశీల!

రావ:—(క్రోధముతో) సోదరా! విభీషణా! ఈకీశాధముండు లంకఁజొచ్చి, చేయరానిపనులఁజేసి, రాజునని యొకింతయుఁదలంపక, పేరోలగమున నిటు ప్రేలుచున్నాఁడు. వీనిఁజంప నాజ్ఞ నొసంగెదను.

ఇంద్ర:—జనకా! వీని ప్రల్లదము లింతవఱకును సహింపుటఁజూడఁ గడుంగడుఁ జిత్రముగనున్నది. ఈతుంటరికోతినిఁ జంపి, వంటయిలు సేర్పించెదను.

ప్రహస్తుఁడు:—సార్వభౌమా! ముదలయేని యీ చెనఁటినిఁ ద్రుటిలో నమ్రింగి, పుత్త్రశోకము నడంచుకొందును.

విభీ:—రాక్షసేంద్రా! లంకాధినాథా! రాజనీతివిశారదులరగు తామీగతి మాటాడఁజనునా? దూతను వధించుట రాజధర్మముగాదు. సోదరా! తమ్ముఁడనగు నావిన్నపమాలకించి, మరణదండనము విధింపక, యుచితానుచితములఁ జక్కఁగఁ బరిశీలించి, తగుశిక్ష విధింపఁగోరెదను. రాజనీతివేత్తలు సందేశహరునకు విరూపత్వమును, కొరడాదెబ్బలును, ముండనమును, నిప్పుచుఱుకును శిక్షలుగా విధించిరని విజ్ఞులవలన విన్నాఁడను. ఆనాల్గింట నొక్కండు విధింపుఁడు.

హను:—(తనలో) అందు నాలుగవదియే విధించు నెడ నామిగిలినకార్యమున కెంతయు సహకారియగును.

రావ:—విభీషణా! రాజనీతివేత్తవగు నీ నుడు లవశ్యాదరణీయములు. ప్లవంగమునకు వాలము ప్రధానాంగమగుట దానినే కాల్చనాజ్ఞనొసంగెదను. (సేవకులఁగాంచి) ఓరీ! మీరీ చెనఁటికోఁతినిఁ గొంపోయి, వాలమునకు బట్టలఁజుట్టి, యగ్ని నంటించి వదలివేయుఁడు.

సేవకులు:—మహాప్రసాదము. ప్రతాపలంకేశ్వరా!

దైత్యకుల సార్వభౌమా! తమయాజ్ఞానుసార మీకోఁతిని నగ్నిచే బహూకరింతుము.

హను:—(స్వగ) నామనోభీష్టము సిద్ధించినది. ఇఁక లంకను గాల్చివైచి, నాపరాక్రమమింకను రావణునకుఁజూపి, పోయెదఁగాక!

(హనుమంతుఁడు రాక్షసులతో నిష్క్రమించును.)



# పంచమాంకము

## తృతీయరంగము

స్థలము: మాల్యవంతప్రాంతము.

ప్రవేశము: రామలక్ష్మణ సుగ్రీవులును, గొందఱు వానరులును.

రాము:—సుగ్రీవా! తూర్పుదిక్కునకేఁగిన వినతుఁడును, పశ్చిమదిశకరిగిన సుషేణుఁడును, నుత్తరయిక్కునకుఁ జనిన శతవలియు, సీతజాడలఁదెలియక యరుదెంచియుండిరి. దక్షిణదిశకేఁగిన యంగదాది వానరవీరు లింతవఱకును రారైరి. వారైన సీతావృత్తాంతమును దెలిసివత్తురో, లేదో కదా! ఎన్ని దినంబులీగతి సీతావియోగభారమును భరింపఁగలను?

గీ. వెదుకఁబోయిన వానరవరులు
మరలివచ్చిరి; యాశలు మంటఁగలిసె;
ప్రాణపదమైన సీతను బాసి, నేను
బ్రతుకఁజాలను మార్తాండవరతనూజ!

సుగ్రీ:—మిహిరాంశువంశ కలశోదధి కౌస్తుభరత్నా! శ్రీరామచంద్రా! అంగదాది వానరవీరులరుదెంచి, మధువనమును బాడొనరించుచున్నారని, వనపాలకు లింతకుముందే విన్నవించిచనిరి. వీరు, తప్పక సీతామతల్లిజాడల నరసియే యుందురని తోఁచుచున్నది. లేకున్న నాకుఁ గడుఁ బ్రియముగూర్చు మధువనంబును బాడుచేయ సాహసింపరు.

రాము:—సుగ్రీవా! అట్టులగుచో వారిని వేగమే రప్పింపుము.

(ప్రవేశము: హనుమదాది వానరులు)

(అందఱును శ్రీరామలక్ష్మణులకును, సుగ్రీవునకును, నమస్కరింతురు.)

రాము:—హనుమంతా! మామకప్రాణ సమానయగు జనకజనుగాంచి, వచ్చితివా? వేగంబ నుడువుము.

లక్ష్మ:—రామభక్తాగ్రేసరా! కాలయాపనం బేల చేయుదువు? త్వరితముగ సీతామతల్లివార్తఁ దెలుపుము.

హను:—మహాత్ములారా! సీతామతల్లినిఁ జూచి వచ్చితిని.

రాము:—ఆంజనేయా! నిన్నుఁబోలు సమర్థులీ భువి నెందైననుందురే! సీతాదేవిజాడలనరసి, నాప్రాణముల నిలిపితివి.

హను:—రామచంద్రా! దక్షిణసముద్రమునకవ్వల శత యోజనవిస్తీర్ణంబగు లంకయనుపట్టణం బొండుగలదు. అది రావణుని నెలవు. రావణునిచే నపహృతయగు సీత యశోక వనంబున, శింశుపాతరుమూలంబున, రాక్షసాంగనలుగాఁపుండ జడలుదాల్చి, మలినాంబరధారిణియై, వెలవెలఁబోవు మోముతో దుస్తరకష్టములఁజిక్కి, పరితపించుచున్నది. కోదండరామా! మీయంగుళీయకమునుగని, మిమ్ముఁగన్నంత

పంతనమంది, మీక్షేమములరసి, తన్ను రక్షింప మిమ్ము వేడు మనెను. మఱందిరఘుగు లక్ష్మణునికుశలమడిగి, తానాడిన కఠిన వాక్కులమఱవ బ్రతిమాలుకొనెను. తండ్రీ! యిఁక నెలకంటె నెక్కువ బ్రతుకఁజాలదనిచెప్పి, యానవాలుగ శిరోరత్నము నొసంగెను. ఇదిగో! రత్నము.

(అని శిరోమాణిక్య మొసంగును)

రాము:—హనుమంతా! నీయుపకారం బెన్నటికిని మఱవఁజాలను. సుగ్రీవునకును, మాకును, సఖ్యమొనరించుట యేగాక, యష్టకష్టములకోర్చి, రావణునునికి యగు లంకఁ జొచ్చి, సీతాన్వేషణమొనర్చి, నను ధన్యునిఁ జేసితివి.

హను:—రామచంద్రా! ఇదంతయు మీయనుగ్రహాతిశయముగాని, వేఱుగాదు. దీనికి నన్నిటు లగ్గింపనేల?

(మంగళము) (యవనిక పడును.)

గద్య: ఇది శ్రీ సీతారామచంద్ర చరణసేవా ప్రసాదిత కవితా
విచిత్ర వినయధురీణ పాకనాటి కులాలంకార శతావధాని
పంచాననకవి సింహకావ్యకళానిధి రాజశేఖర కవిరాజ
ప్రియశిష్య ముద్దుటుంగరముల గోత్రపవిత్ర చింతా
లింగారెడ్డి నాగమాంబల ప్రథమతనూజ నర
సింహనామధేయ ప్రణీతంబైన శ్రీ సీతా
న్వేషణమను నాటకము సర్వము
స మా ప్త ము.

శ్రీ శ్రీ శ్రీ.

# చందాదారులు

| | | | |
|---|---|---|---|
| 1 | మ-రా-శ్రీ | ఎ. నారాయణప్పగారు | అనంతపురము |
| 2 | ,, | పి. లింగనగౌడుగారు | ఆమిదాల |
| 3 | ,, | కె. రంగారావుగారు | ,, |
| 4 | ,, | డి. వెంకటస్వామిగారు | ,, |
| 5 | ,, | యస్. తిమ్మప్పగారు | ,, |
| 6 | ,, | బి. చిన్ననారాయణప్పగారు | ,, |
| 7 | ,, | తల్లం సుబ్బరాయప్ప కొ. నారాయణప్పగారు | ,, |
| 8 | ,, | దండెం తిప్పయ్యగారు | ,, |
| 9 | ,, | కొరకూటి రామన్నగారు | ,, |
| 10 | ,, | సూరా చలమయ్యగారు | ,, |
| 11 | ,, | పురాణమఠం నంజుండయ్యగారు | ,, |
| 12 | ,, | కొప్పరం బాచన్నగారు | ,, |
| 13 | ,, | కొరకూటి సుబ్బయ్యగారు | ,, |
| 14 | ,, | కె. నరసింగరావుగారు | ఇంద్రావతి |
| 15 | ,, | ఓరుగంటి అయ్యప్పగారు | ఉండబండ |
| 16 | ,, | పా. బసవనగౌడుగారు | ,, |
| 17 | ,, | జె. పంపాపతిగారు | ,, |
| 18 | ,, | కొంజేటి సుబ్బయ్యగారు | ఉరవకొండ |
| 19 | ,, | యం. ఖలందర్ హుసేన్ సాహెబ్ | ,, |
| 20 | ,, | యస్. సి. శాస్త్రి అండ్ బ్రదర్స్ | ,, |
| 21 | ,, | కొత్త జంగమప్పగారు | ,, |
| 22 | ,, | ముక్తాపురము వీరప్పగారు | ,, |

| | | | |
|---|---|---|---|
| 23 | మ-రా-శ్రీ | చంద్ర బండెప్పగారు | ఉరవకొండ |
| 24 | ,, | ఆర్. రంగప్పగారు | ,, |
| 25 | ,, | కొత్తపల్లి బ్రహ్మయ్యాచారిగారు | ,, |
| 26 | ,, | దండా భీమప్పగారు | ,, |
| 27 | ,, | యస్. మహమ్మద్ ఆదంసా హెబ్ గారు | ,, |
| 28 | ,, | యం. కేశోజిరావుగారు | ,, |
| 29 | ,, | కరూరు పెద్దసంజీవప్పగారు | ,, |
| 30 | ,, | బి. బండెయ్యగారు | ,, |
| 31 | ,, | కె. యస్. రామమూర్తిగారు | ,, |
| 32 | ,, | పి. రామలింగప్పగారు | ,, |
| 33 | ,, | కొత్త చిన్నయ్యగారు | ,, |
| 34 | ,, | గట్టు హనుమప్పగారు | ,, |
| 35 | ,, | ఇటిగాని సెట్టేకల్లప్పగారు | ,, |
| 36 | ,, | చింతా నారాయణప్ప అండ్ కో | ,, |
| 37 | ,, | కె. నారాయణశాస్త్రిగారు | ,, |
| 38 | ,, | జిన్నా రామలింగప్పగారు | ,, |
| 39 | ,, | నలబాళ ఓబళప్పగారు | ,, |
| 40 | ,, | కె. సేతురామశాస్త్రిగారు | ,, |
| 41 | ,, | ఎత్తిసెట్టి వీరప్పగారు | ,, |
| 42 | ,, | పాల్తూరు మల్లేశప్పగారు | ,, |
| 43 | ,, | బి. అప్పాస్వామిశ్రేష్ఠిగారు, బి.ఏ. | అనంతపురము |
| 44 | ,, | ఐ. యస్. జాన్‌గారు, బి.ఏ. | ఉరవకొండ |
| 45 | ,, | కె. శ్రీరామశాస్త్రిగారు, బి ఏ.,బి.యల్. | ,, |
| 46 | ,, | బి. యస్. సోమయ్యగారు, బి.ఏ.,బి.ఇడి. | అనంతపురము |
| 47 | ,, | ఎం. ఎల్. సుబ్బయ్యశ్రేష్ఠిగారు, బి.ఏ.,బి.ఇడి. | ఉరవకొండ |
| 48 | ,, | టి. లక్ష్మీపతిగారు, బి.ఏ., యల్.టి. | ,, |

| | | | |
|---|---|---|---|
| 49 | మ-రా-శ్రీ | క. కృష్ణప్పగారు, బి.ఏ., బి.ఇడి. | ఉరవకొండ |
| 50 | ,, | ఎట్రా విశ్వనాథముగారు, బి.ఏ. | ,, |
| 51 | ,, | వై. వేంకటరావుగారు | ,, |
| 52 | ,, | ఎ. వేంకటరత్నంగారు | ,, |
| 53 | ,, | పి. వీరరాఘవయ్యగారు | ,, |
| 54 | ,, | ఎ. నారాయణస్వామిగారు | ,, |
| 55 | ,, | పెద్ద హుచ్చారెడ్డిగారు | కడదరబెంచి |
| 56 | ,, | నూతేటి నారాయణప్పగారు | కడవలకుంట |
| 57 | ,, | నూ. యంగన్న కొ. నారాయణప్పగారు | ,, |
| 58 | ,, | గడేకల్లు వెంకటరెడ్డిగారు | కమలపాడు |
| 59 | ,, | నక్కా శంకరరెడ్డిగారు | ,, |
| 60 | ,, | కరణము నారాయణరావుగారు | ,, |
| 61 | ,, | గొల్ల చిన్నసోమప్పగారు | ,, |
| 62 | ,, | దేవేంద్రప్పగారి చిన్నగోవిందరెడ్డిగారు | ,, |
| 63 | ,, | యం. హుచ్చప్పగారు | కరెకముక్కల |
| 64 | ,, | పా. తిమ్మారెడ్డిగారు | ,, |
| 65 | ,, | కరణము వీరభద్రరావుగారు | ,, |
| 66 | ,, | పరమదేవనపల్లి లక్ష్మిరెడ్డిగారు | ,, |
| 67 | ,, | యం. బసప్పగారు | ,, |
| 68 | ,, | కొంకుల శిద్దారెడ్డిగారు | ,, |
| 69 | ,, | బాలన్నగారి తిమ్మారెడ్డిగారు | ,, |
| 70 | ,, | కొంకుల చిన్నవెంకటరెడ్డిగారు | ,, |
| 71 | ,, | యం. ఆలయ్యగారు | ,, |
| 72 | ,, | ఎఱ్ఱగుడి నాగిరెడ్డిగారు | ,, |
| 73 | ,, | యం. చిన్నబండెయ్యగారు | ,, |
| 74 | ,, | షోతుల వెంకటరెడ్డిగారు | ,, |

| | | | |
|---|---|---|---|
| 75 | మ-రా-శ్రీ | హిరేహాళు కరిబసప్పగారు | కరకముక్కల |
| 76 | ,, | పి. నారాయణప్పగారు | కొట్టాలపల్లి |
| 77 | ,, | ఆర్. వేంకటనాయుడుగారు | ,, |
| 78 | ,, | తమ్మినేని చిన్నబాలప్పగారు | ,, |
| 79 | ,, | మలిసెట్టి రామయ్యగారు | ,, |
| 80 | ,, | అలమనేని చిన్నరంగప్పగారు | ,, |
| 81 | ,, | సోంపల్లె వరసన్నగారు | ,, |
| 82 | ,, | పా. నారాయణప్పగారు | ,, |
| 83 | ,, | మోదిపల్లి పెద్దయెర్రప్పగారు | ,, |
| 84 | ,, | కరణము నారాయణప్పగారు | ,, |
| 85 | ,, | బాయికాటి పెద్దన్నగారు | ,, |
| 86 | ,, | కాకర్ల పెద్దరంగప్పగారు | ,, |
| 87 | ,, | బాయికాటి రంగప్పగారు | ,, |
| 88 | ,, | మోదిపల్లి పెద్దసుబ్బరాయుడుగారు | ,, |
| 89 | ,, | పాటీలు నాగిరెడ్డిగారు | కొత్తకోట |
| 90 | ,, | ఉన్నం భీమప్పగారు | కొనకొండ్ల |
| 91 | ,, | హోతూరు శిద్దనగౌడుగారు | ,, |
| 92 | ,, | పాటీలు బసవనగౌడుగారు | ,, |
| 93 | ,, | హెచ్. కే. శ్రీనివాసరావుగారు | ,, |
| 94 | ,, | కే. గాదిలింగప్పగారు | ,, |
| 95 | ,, | పి. రామనగౌడుగారు | గంజికుంట |
| 96 | ,, | కరణము హంపిరెడ్డిగారు | గడేకల్లు |
| 97 | ,, | పి. నారాయణరెడ్డిగారు | గడేహోతూరు |
| 98 | ,, | ఎ. శివానందముగారు | ,, |
| 99 | ,, | గడపూటి గోవిందప్పగారు | ,, |
| 100 | ,, | పాటీలు నారాయణరెడ్డిగారు | ,, |

| | | | |
|---|---|---|---|
| 101 | మ-రా-శ్రీ | బి. వీరపరాజు గారు | గడేహోతూరు |
| 102 | ,, | కడియాల లక్ష్మప్పగారు | ,, |
| 103 | ,, | కడియాల తిమ్మప్పగారు | ,, |
| 104 | ,, | కె. వెంకోబరావుగారు | చాబాల |
| 105 | ,, | కె. హనుమంతరావుగారు | ,, |
| 106 | ,, | గొల్ల నవసన్నప్పగారు | ,, |
| 107 | ,, | సి. కె. నారాయణరావుగారు | ,, |
| 108 | ,, | జి. హనుమంతప్పగారు | ,, |
| 109 | ,, | యస్. శ్రీనివాసులుగారు | ,, |
| 110 | ,, | కె. రామప్పగారు | చిన్నముష్టూరు |
| 111 | ,, | పి. జయిట్లగౌడుగారు | ,, |
| 112 | ,, | గౌరిశెట్టి ముద్దప్పగారు | చీకలగురికి |
| 113 | ,, | శిద్ధఋషి రుద్రయ్యగారు | ,, |
| 114 | ,, | యస్. కె. రామచంద్రరావుగారు | ,, |
| 115 | ,, | యం. చిదంబరప్పగారు | జనార్దనపల్లి |
| 116 | ,, | బోగాల లక్ష్మప్పగారు | ,, |
| 117 | ,, | మోదేపల్లి తిరిపాలప్పగారు | ,, |
| 118 | ,, | ముప్పారపు ఎర్రప్పగారు | ,, |
| 119 | ,, | పెనికెలపాటి హనుమంతరాయుడుగారు | ,, |
| 120 | ,, | పెనికెలపాటి పకీరప్పగారు | ,, |
| 121 | ,, | కరణము వెంకోబరావుగారు | డోనేకల్లు |
| 122 | ,, | పాటీలు తిమ్మనగౌడుగారు | ,, |
| 123 | ,, | ఇల్లూరు వేంకటాద్రప్పగారు | తిమ్మనచర్ల |
| 124 | ,, | యస్. నాగప్పగారు | ,, |
| 125 | ,, | సత్రసాల సోమప్ప అండు బ్రదర్స్ | ,, |
| 126 | ,, | కె. శ్యామరావుగారు | ,, |

| | | | |
|---|---|---|---|
| 127 | మ-రా-శ్రీ | కె. సూర్యనారాయణమూర్తిగారు, యల్.యం.పి. | తిమ్మనచర్ల |
| 128 | ,, | కె. ఓబళపతిగారు | గుత్తి |
| 129 | ,, | పి. బాలసుబ్బయ్య శ్రేష్ఠిగారు | తిమ్మనచర్ల |
| 130 | ,, | కె. అచ్యుతరావుగారు | ,, |
| 131 | ,, | ఎ. రాయప్పగారు | ,, |
| 132 | ,, | టి. సంజీవరెడ్డిగారు | ,, |
| 133 | ,, | బుశెట్టి శరభయ్య శ్రేష్ఠి అండ్ సన్ | ,, |
| 134 | ,, | దబ్బర సుబ్బరాయఁడుగారు | ధర్మపురి |
| 135 | ,, | దబ్బర చిన్నసుబ్బరాయఁడుగారు | ,, |
| 136 | ,, | జె. హనుమంతరాయఁడుగారు | ,, |
| 137 | ,, | ఎ. శేషమరాజుగారు | ,, |
| 138 | ,, | డి. చిన్నపుల్లయ్యగారు | ,, |
| 139 | ,, | బి. బాలప్పగారు | ,, |
| 140 | ,, | ఆర్. బాలిరెడ్డిగారు | ,, |
| 141 | ,, | ఎ. సుబ్రహ్మణ్యముగారు | ,, |
| 142 | ,, | జె. పి. వెంకటప్పగారు | ,, |
| 143 | ,, | బాలమార్కాపురము రెడ్డిగారు | ,, |
| 144 | ,, | కల్లుమడి నరసప్పగారు | ,, |
| 145 | ,, | బి. ఆర్. రామమూర్తిగారు బి.ఇ. | ధర్మవరము |
| 146 | ,, | హెచ్. పద్మనాభరావుగారు | నరిమెట్ల |
| 147 | ,, | కె. హులికుంటరావుగారు | ,, |
| 148 | ,, | రాజాల హనుమంతప్పగారు | ,, |
| 149 | ,, | రాజాల చన్నప్పగారు | ,, |
| 150 | ,, | వడ్ల బండెప్పగారు | ,, |
| 151 | ,, | జక్కరెడ్డి హనుమంతప్పగారు | ,, |
| 152 | ,, | కోకా పెద్దవెంకటప్పగారు | నింబగల్లు |

| | | | |
|---|---|---|---|
| 153 | మ-రా-శ్రీ | నేలపాటి చంద్రప్పగారు | నింబగల్లు |
| 154 | ,, | కొంకా అంజనప్పగారు | ,, |
| 155 | ,, | గవడగుండి చిన్న అయ్యప్పగారు | ,, |
| 156 | ,, | వి. యం. నాచయ్యగారు | ,, |
| 157 | ,, | పి. విరూపాక్షశాస్త్రిగారు | ,, |
| 158 | ,, | సన్నపరెడ్డి శంకరప్పగారు | ,, |
| 159 | ,, | కొంకా సన్న వెంకటప్పగారు | ,, |
| 160 | ,, | వి. గోవిందప్పగారు | ఉరవకొండ |
| 161 | ,, | కొంకా గంగప్పగారు | నింబగల్లు |
| 162 | ,, | పాటీలు తిమ్మారెడ్డిగారు | నీళ్లులేని తిమ్మాపురము |
| 163 | ,, | కొట్లో శివారెడ్డిగారు | ,, |
| 164 | ,, | కావలి తిమ్మప్పగారు | ,, |
| 165 | ,, | టి. కె. వేంకటసుబ్బారావుగారు | ,, |
| 166 | ,, | యన్. మహబూబ్ సాహెబ్ గారు | పంచెకుంట |
| 167 | ,, | కరణము కృష్ణరావుగారు | ,, |
| 168 | ,, | దివాకరనాయడుగారు | ,, |
| 169 | ,, | పా. చిన్న రామనగౌడుగారు | పాపిలి |
| 170 | ,, | కె. మధ్వరావుగారు | ,, |
| 171 | ,, | పి. రామనగౌడుగారు | ,, |
| 172 | ,, | బొల్లేని చిన్న హనుమంతప్పగారు | ,, |
| 173 | ,, | బొల్లేని సుబ్బన్నగారు | ,, |
| 174 | ,, | యస్. నారాయణప్పగారు | ,, |
| 175 | ,, | కె. వెంకటభీమరావుగారు | పాల్తూరు |
| 176 | ,, | పి. కరిబసవనగౌడుగారు | ,, |
| 177 | ,, | కె. నారాయణరావుగారు | ,, |
| 178 | ,, | నివృత్తి వెంకటశేషప్పగారు | ,, |

| | | | |
|---|---|---|---|
| 179 | మ-రా-శ్రీ | పి. మునుస్వామిగారు | పాల్తూరు |
| 180 | ,, | విశ్వబ్రాహ్మణ బండెప్పాచారిగారు | ,, |
| 181 | ,, | సల్లె శిద్దప్పగారు | ,, |
| 182 | ,, | అవ్వాజి ఎల్లప్పగారు | ,, |
| 183 | ,, | కుదిరికార బండెప్పగారు | ,, |
| 184 | ,, | దేవర బసప్పగారు | ,, |
| 185 | ,, | కుదిరికార శివప్ప గారు | ,, |
| 186 | ,, | తిప్పారెడ్డిగారు | హాలికి |
| 187 | ,, | గాజుల చిన్ననరసింహప్పగారు | ,, |
| 188 | ,, | రాయల పాపన్నగారు | ,, |
| 189 | ,, | పాటీలు ఓబిరెడ్డిగారు | ,, |
| 190 | ,, | జి. నారాయణరావుగారు | ,, |
| 191 | ,, | ఆర్. సభాపతిరావుగారు, బి.ఏ., బి.యల్. | బళ్లారి |
| 192 | ,, | కె. దివాకరరావు గారు, బి.ఏ. | ,, |
| 193 | ,, | ది యున్నియన్ సీగ్ మోటార్ వర్క్సు | ,, |
| 194 | ,, | కె. నరసింహశాస్త్రిగారు, బి.ఏ. బి.యల్. | ,, |
| 195 | ,, | ఎ. సత్యనారాయణరావుగారు, బి.ఏ., యల్.టి. | ,, |
| 196 | ,, | డాక్టరు. యం. సీతారామశర్మ గారు | ,, |
| 197 | ,, | వేదాంతముగారు, బి.ఎ.,యల్.టి. | ,, |
| 198 | ,, | పి. రంగబ్రహ్మణ్యంనాయుడుగారు, బి.ఏ. | ,, |
| 199 | ,, | సెక్రెటరి సన్మార్గసమాజము థియసాఫికల్ లాడ్జి | ,, |
| 200 | ,, | డి. కె. కృష్ణమాచార్యులుగారు | ,, |
| 201 | ,, | డాక్టరు. డి. శేషాచార్యులుగారు | ,, |
| 202 | ,, | ఆర్. కరిబసవనగౌడుగారు | బుధగవి |
| 203 | ,, | కె. శేషగిరిరావుగారు | ,, |
| 204 | ,, | కె. రామచంద్రరావుగారు | బొమ్మనహాళు |

| | | | |
|---|---|---|---|
| 205 | మ-రా-శ్రీ | యం. భీమసేనరావుగారు | మాళాపురము |
| 206 | ,, | యం. యస్. కృష్ణన్ గారు | ,, |
| 207 | ,, | కె. వెంకటనరసప్పగారు | మోపిడి |
| 208 | ,, | అగడి హనుమంతప్పగారు | ,, |
| 209 | ,, | దగ్గుపాటి రామప్పగారు | ,, |
| 210 | ,, | మేకల వెంకటరమణప్పగారు | ,, |
| 211 | ,, | మేకల పెరివిలప్పగారు | ,, |
| 212 | ,, | కరణము భీమసేనరావుగారు | ,, |
| 213 | ,, | డా. పో. వెంకటరెడ్డిగారు | రాగులపాడు |
| 214 | ,, | కె. నరసింగరావుగారు | ,, |
| 215 | ,, | పాటీలు తిమ్మారెడ్డిగారు | ,, |
| 216 | ,, | యన్. జానకిరామయ్యగారు | ,, |
| 217 | ,, | రాయంకి నరసింహప్పగారు | రామాపురముకొట్టాల |
| 218 | ,, | ముద్దిపాట్ల వెంకటప్పగారు | ,, |
| 219 | ,, | రాయంకి వేంకటనాయుడుగారు | ,, |
| 220 | ,, | కె. రామరావుగారు | రాయదుర్గము |
| 221 | ,, | ఆర్. హనుమంతరావుగారు | రేకట్ల |
| 222 | ,, | నెట్యము రామప్పగారు | ,, |
| 223 | ,, | దేవినేని రామప్పగారు | ,, |
| 224 | ,, | దేవినేని నారప్పగారు | ,, |
| 225 | ,, | దేవినేని బొజ్జప్పగారు | ,, |
| 226 | ,, | ముత్తులూరి బొజ్జప్పగారు | ,, |
| 227 | ,, | ముత్తులూరి కొండప్పగారు | ,, |
| 228 | ,, | వి. హనుమంతరెడ్డిగారు | ,, |
| 229 | ,, | యం. వేంకటరాజుగారు | శెణిమాకులపల్లె |
| 230 | ,, | దేవినేని నరసప్పగారు | ,, |

| | | | |
|---|---|---|---|
| 231 | మ-రా-శ్రీ | కళ్యాల పెద్దహొన్నూరప్పగారు | రేణిమాకులపల్లె |
| 232 | ,, | దేవినేని చౌడప్పగారు | ,, |
| 233 | ,, | కె. నరసింగరావుగారు | ఉప్పవరము |
| 234 | ,, | బెల్లము సంజీవప్పగారు | ,, |
| 235 | ,, | బోదపాటి హనుమంతప్పగారు | ,, |
| 236 | ,, | రెడ్డి వీరనగౌడుగారు | ,, |
| 237 | ,, | కె. మాణిక్యనారాయణరావుగారు | వజ్రకరూరు |
| 238 | ,, | బి. వేంకటరమణరావుగారు | ,, |
| 239 | ,, | పట్టా పెద్ద ఫకురుద్దీన్‌సాహెబ్‌గారు | ,, |
| 240 | ,, | రాచూరు నారాయణస్వామిశ్రేష్ఠిగారు | ,, |
| 241 | ,, | కామగారి తిమ్మారెడ్డిగారు | ,, |
| 242 | ,, | కామగారి మల్లారెడ్డిగారు | ,, |
| 243 | ,, | సత్రసాల కృష్ణయ్యశ్రేష్ఠిగారు | ,, |
| 244 | ,, | వడ్ల శరభయ్యగారు | ,, |
| 245 | ,, | వి. అలంపురప్పగారు | ,, |
| 245 | ,, | వలిపిరెడ్డి, సింగరప్ప, నాగప్పగార్లు | విడపనకల్లు |
| 247 | ,, | యం. గుండాచార్యులుగారు | ,, |
| 248 | ,, | పా. విరూపాక్షగౌడుగారు | ,, |
| 249 | ,, | కె. ఘనగిరి రావుగారు | ,, |
| 250 | ,, | పాళేగార్ వెంకప్పనాయఁడుగారు | వెంకటాంపల్లి |
| 251 | ,, | బొమ్మినేని నారాయణప్పగారు | ,, |
| 252 | ,, | గవి. లింగప్పనాయఁడుగారు | ,, |
| 253 | ,, | కె. రామకృష్ణరావుగారు | వెలిగొండ |
| 254 | ,, | మఠము వీరయ్యగారు | ,, |
| 255 | ,, | పాటీలు శిద్దారెడ్డిగారు | వేల్పుమడుగు |
| 256 | ,, | కోట నరసింహారెడ్డిగారు | ,, |

| | | |
|---|---|---|
| 257 మ-రా-శ్రీ | యం. గంగయ్యగారు | వ్యాసాపురము |
| 258 ,, | గడిపూటి లాలెప్పగారు | ,, |
| 259 ,, | పాటీలు వీరనగౌడుగారు | ,, |
| 260 ,, | హెచ్. పి. శంకరగౌడుగారు | హంచినహాళు |
| 261 ,, | పి. రామరావుగారు | ,, |
| 262 ,, | వీరభద్రగౌడుగారు | ,, |
| 263 ,, | యం. విరూపాక్షగౌడుగారు | ,, |
| 264 ,, | హెచ్. నరసోజిరావుగారు | హోవళిగి |
| 265 ,, | మాల్యం పంపయ్యగారు | ఆమిదాల |
| 266 ,, | అంగడి ఈరప్పగారు | హందిగుంట |
| 167 ,, | పి. కదిరప్పగారు | ,, |
| 168 ,, | సెట్యం నరసప్పగారు | పాపిలి |
| 169 ,, | బండారు హనుమంతప్పగారు | రేణిమాకులపల్లె |
| 170 ,, | వంకదారి వేంకటరామయ్యగారు | కత్రిమల |
| 271 ,, | పా. చిదంబరరెడ్డిగారు | ,, |
| 272 ,, | కరణము బుగ్గరామప్పగారు | ,, |

Printed at the Lodhra Press, Royapettah, Madras.

# నిబంధనలు

1. ఇందు మూఁడునెలల కొకటివంతున సంవత్సరమునకు నాలుగు గ్రంథము లాంధ్రమున వెలువడును. ప్రతి పుస్తకము క్రౌనుసైజు ౮౦-౧౦౦ పుటలుండును.

2. ఇందు, ప్రబంధములు, నాటకములు, కథలు, నవలలు, కవులయు మహాపురుషులయు జీవితములు ప్రచురింపఁబడును.

3. సంవత్సర చందా రెండు రూపాయలు. ప్రవేశ రుసుము నాలుగు అణాలు. సంవత్సర చందా ముందుగాఁ జెల్లించువారు తపాలాఖర్చులు లేకయే పుస్తకములు పడయఁ గలరు. అట్లు చెల్లింపనియెడల మొదటిపుస్తకము వి.పి గాఁ బంపఁబడును. అప్పుడు సంవత్సరచందా మొత్తము వి.పి.ఖర్చులతోఁగూడఁ జెల్లింపవలయును. అట్లు చెల్లించిన మిగిలిన 3 పుస్తకములు తపాలాఖర్చులు లేకయే పొందవచ్చును.

4. ఈ గ్రంథమండలి కొక్కతూరి నూటపదునాఱు రూప్యము లొసఁగువారు రాజపోషకులుగ నెన్నఁబడుదురు. గ్రంథమండలి పనిచేయునంతకాల మిందుఁ బ్రచురింపఁబడు ప్రతిగ్రంథమునందును వారి ఛాయాపటములు ముద్రింపఁబడును. గ్రంథమాలా ప్రచురణములన్నియు వారి కుచితముగాఁ బంపఁబడును.

5. ఏఁటేఁటఁ బోషకులు పది రూప్యములును, అభిమానులైదురూప్యములును జెల్లింపవలయును. ఇందు, ప్రకటింపఁబడు గ్రంథములందు, పోషకులయు, అభిమానులయు చందాదారులయు నామములు ముద్రింపఁబడును.

# మారుతీ గ్రంథమండలి ప్రచురణములు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | తులసీదళము (మంజరీ ద్విపద) అప్రూవ్డు 4-5-1937 ఫో. సెం. జా. గె. పుట 210 | 0 | 8 | 0 |
| 2. | సీతాపహరణము (నాటకము) అప్రూవ్డు 4-5-1937 ఫో. సెం. జా. గె. పుట 226 | 0 | 10 | 0 |
| 3. | ప్రేమపరిణామము (సాంఘికనవల) 210 పుటలు. | 0 | 10 | 0 |
| 4. | కావ్యమాల (ఆంధ్రమహాకవుల ఖండకావ్యముల సంపుటి) అప్రూవ్డు 4-5-1937 ఫో. సెం. జా. గె. పుట 213 | 0 | 10 | 0 |
| 5. | గౌతమబుద్ధుడు (నాటకము) 152 పుటలు. అప్రూవ్డు 9-11-1937 ఫో. సెం. జా. గె. పుట 594 | 0 | 10 | 0 |
| 6. | కథాగుచ్ఛము, నీతిదాయకము అప్రూవ్డు 9-11-1937 ఫో. సెం. జా. గె. పుట 594 | 0 | 10 | 0 |
| 7. | మేఘప్రతి సందేశగీతము (పద్యకావ్యము) | 0 | 10 | 0 |
| 8. | సీతాన్వేషణము (నాటకము) | 0 | 10 | 0 |

విలాసము:—

కార్యదర్శి, మారుతీ గ్రంథమండలి,

ఉరవకొండ (అనంతపురము జిల్లా).

# ప్రకటన

రాఁబోవు గ్రంథమింకను నిర్ణయింపఁబడనికారణమున నిట నుదాహరింపలేదు. నిర్ణయించి, సకాలమున కందఁజేయుదును.

[1938-వ సం. జనవరినెలలో వెలువడును.]

సంపాదకుఁడు.

